ప్రపంచ తెలుగుమహాసభ ప్రచురణ

# తెలుగువారి సంస్కృత భాషాసేవ


రచయిత

శ్రీ పి. శ్రీరామమూర్తి






ప్రచురణ

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ

కళాభవన్, సైఫాబాద్, హైద్రాబాద్-500 004.

# ముందు మాట

ఎన్నో ఏళ్లుగా అనుకొంటున్న ప్రపంచ తెలుగు మహాసభలు ఆంధ్ర మహాజనుల ఆదర సహకారములతో విజయవంతముగ గత ఏప్రిల్ 12 (ఉగాది) మొదలుగ జరిగినవి. ప్రపంచంలోని తెలుగువారి ప్రతినిధులందరిని ఒకచోట సమీకరించవలెనని పెద్దలందరూ కన్నకలలు ఫలించిన శుభ సమయమది. గత ఉగాది, రెండువేల అయిదువందల సంవత్సరాల తెలుగుజాతి చరిత్రలో, మరపురాని మధుర ఘట్టము కాగలదు.

క్రీస్తు పూర్వం మూడవ శతాబ్దికి చెందిన శాతవాహన రాజుల కాలం నుండి తెలుగు ప్రజలకు ఒక విశిష్టమైన చరిత్ర ఉన్నది. భారత దేశంలో తెలుగుమాట్లాడు ప్రజలు దాదాపు ఐదుకోట్లకుపైగా ఉన్నారు. హిందీమాట్లాడే వారి తరువాతి స్థానం తెలుగువారిదే. బౌద్ధపూర్వయుగంనుంచి ఇటీవల బ్రిటిష్ సామ్రాజ్య పరిపాలనాయుగం వరకూ తెలుగువారు పెద్దఎత్తున ప్రపంచం నలుమూలలకూ వలసవెళ్లడం జరిగింది. అట్లావెళ్ళిన తెలుగువారు తమ భాషా సంస్కృతి సంప్రదాయాలను ఆయా జాతీయ జీవనవిధానాలలో మేళవించి, వాటిని సుసంపన్నము చేస్తున్నారు.

ప్రపంచ తెలుగు మహాసభల ప్రధాన లక్ష్యం తెలుగుప్రజల, తెలుగు అభిమానుల ప్రతినిధులను ఒక వేదికమీద సమావేశపర్చడం. జాతీయ, అంతర్జాతీయ సాంస్కృతిక రంగాలలో తెలుగువారు చేయవలసిన కృషినిగూర్చి చర్చించి, నిర్ణయించుకోవడానికి, తద్వారా వివిధ చైతన్యస్రవంతులను ఏకోన్ముఖంచేసి మన సాంస్కృతిక సంబంధాలను దృఢతరంచేసుకోవడానికి ఈ మహాసభలు దోహదకారులు అయినవి. అంతేకాక ఈ మహాసభలు ఆర్ద్రమైన భావ సమైక్యతకు ప్రాతిపదికలై తెలుగు జాతి సమైక్యమగుటకు తోడ్పడినవని విశ్వసిస్తున్నాను.

1975 ఏప్రిల్ 12వ తేదిన, తెలుగు ఉగాది రోజున, ప్రారంభమై ఒక వారం రోజులు జరిగిన ఈ మహాసభలలో వివిధ దేశాలనుంచీ, వివిధ రాష్ట్రాలనుంచీ, యునెస్కోవంటి అంతర్జాతీయ సంస్థలనుంచీ విచ్చేసిన ప్రముఖులు ప్రతినిధులుగానో పరిశీలకులుగానో పాల్గొనినారు. ఆ మహాసభల సమయంలో చర్చాగోష్ఠులు, ప్రదర్శనలు, ప్రచురణలు మొదలైనకార్యక్రమాలు

జరిగినవి. దేశ విదేశాలలోని తెలుగువారి సంస్కృతి, తెలుగు భాషా సాహిత్యాల, కళల అభివృద్ధి, వైజ్ఞానిక సాంకేతిక ప్రగతి మొదలైనవిష యాలపై చర్చాగోష్ఠులు జరిగినవి. తెలుగువారి సాంస్కృతిక వైభవాన్ని వివిధ కోణాలనుంచి ప్రస్ఫుటం చేసే ఒక ప్రదర్శన ఏర్పాటు అయినది. తెలుగువారి సమగ్ర స్వరూపాన్ని సందర్శించడానికి వీలైన సంగ్రహాలయాన్ని, (మ్యూజియంను) స్థాపించడానికి ఈ ప్రదర్శన బీజభూతమయినది. తెలుగు వారి సంస్కృతిని నిరూపించే సాంస్కృతిక కార్యక్రమాలు వారం రోజులపాటు సాగినవి. తెలుగు ప్రజల సంస్కృతి సంప్రదాయాలను విశదంచేసే ప్రత్యేక సంచికలు తెలుగు, ఇంగ్లీషు, హిందీ, ఉర్దు భాషలలో విడుదల అయినవి. ఈ కార్యక్రమాలలో భాగమే ఈ గ్రంథ ప్రచురణ.

తెలుగు ప్రజలు భాష, సాహిత్యం, చరిత్ర, సంస్కృతి, కళలు మొద లైన వివిధ రంగాలలో సాధించిన ఘనవిజయాలను విశదం చేసే గ్రంథాలు అనేకం ఈ మహాసభల సమయంలో విడుదల అయినవి. ఈ గ్రంథాలను రచించి, సకాలంలో మాకు అందించిన రచయితలందరకూ నా కృతజ్ఞతలు. ఈ గ్రంథాలను ప్రచురించే భారం వహించడానికి ముందుకు వచ్చిన అకాదమీ అధినేతలను అభినందిస్తున్నాను. తెలుగువారి విశిష్టతలను విశదంచేసే ఈ గ్రంథాలు సహృదయులందరి ఆదరణ పొందగలవని విశ్వసిస్తున్నాను. అయితే, ఇంత మాత్రం చేతనే ప్రపంచ తెలుగు మహాసభల ఆశయాలు సఫలం కాగల వని నేను అనుకోవడం లేదు. చేయవలసినది ఇంకా ఎంతో ఉంది. ఈ మహా సభల సందర్భంగా నెలకొల్ప బడిన 'అంతర్జాతీయ తెలుగు విజ్ఞాన సంస్థ' మహాసభల ఆశయ సాధనకు పూనుకొనడమే కాక జాతీయ, అంతర్జాతీయ సాంస్కృతిక సంబంధాలను దృఢతరం చేయగలదని నమ్ముతున్నాను.

జలగం వెంగళరావు
అధ్యక్షులు
ప్రపంచ తెలుగు మహాసభలు

# ప రి చ య ము

సహస్రాబ్దాలుగా ప్రవర్ధమానమగుచున్న తెలుగు సంస్కృతిని తెలుగు దేశపు నలుచెరగుల పరిచితము చేయు సంకల్పముతో 1975వ సంవత్సరమును తెలుగు సాంస్కృతిక సంవత్సరముగ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము ప్రకటించినది. అందుకు అనుగుణమైన కార్యక్రమాలను నిర్వహింప జేయుటయేగాక, ప్రపంచములోని వివిధదేశాలలో వసించుచున్న తెలుగువారి సాంస్కృతిక ప్రతినిధులందరును ఒకచోట సమావేశమగు వసతిని కల్పించుటకై 1975, ఏప్రిల్ 12 (తెలుగు ఉగాది) మొదలుగ ప్రపంచ తెలుగు మహాసభ హైదరాబాదున జరుగు నటుల ప్రభుత్వము నిర్ణయించినది అందుకు ఒక ఆహ్వాన సంఘము ఏర్పాటయినది. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ముఖ్యమంత్రి మాన్యశ్రీ జలగం వెంగళరావుగారు ఆ సంఘమునకు అధ్యక్షులు; విద్యాశాఖామంత్రి మాన్యశ్రీ మండలి వెంకట కృష్ణారావుగారు దాని కార్య నిర్వాహకాధ్యక్షులు; ఆర్థిక మంత్రి మాన్యశ్రీ పిడతల రంగారెడ్డిగారు ఆర్థిక, సంస్థా కార్యక్రమాల సమన్వయ సంఘాల అధ్యక్షులు.

ఆ సంఘము, ప్రపంచ తెలుగు మహాసభల సందర్భమున వచ్చువారికి తెలుగు జాతి సాంస్కృతిక వైభవమును తెలియజేయుటకు అనువుగ ఆంధ్ర భాషా సాహిత్య, కళా చరిత్రాదికములను గురించి ఉత్తమములు, ప్రామాణికములునగు కొన్ని లఘు గ్రంథములను ప్రకటించవలెనని సంకల్పించి, ఆ కార్యనిర్వహణకై 44 మంది సభ్యులుకల ఒక విద్వత్సంఘమును, శ్రీ నూకల నరోత్తమరెడ్డిగారి అధ్యక్షతన నియమించినది, ఆ విద్వత్ సంఘము ఆ లఘు గ్రంథముల వస్తువుల నిర్దేశించి వానిరచనకై ఆయా రంగములందు పేరుగనిన ప్రముఖులను రచయితలుగ యెన్నుకొనినది. ఈ విధముగ సిద్ధమైన గ్రంథములలో భాషా, సాహిత్య, చారిత్రక విషయములకు సంబంధించిన వానిని ప్రకటించు బాధ్యతను ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాదమీ వహింప వలసినదిగ ప్రపంచ తెలుగుమహాసభా కార్యనిర్వాహకాధ్యక్షులు మాన్యశ్రీ మండలి వెంకట

కృష్ణారావుగారు అకాడమీని కోరిరి. మహాసభా సఫలతకొరకై కృషి చేయు సంకల్పముతో ఈ బాధ్యతను వహించుటకు అకాడమీ సంతోషముతో అంగీకరించినది.

ఆ విధముగా ప్రకటింపబడిన గ్రంథశ్రేణిలో ఈ 'తెలుగువారి సంస్కృత భాషాసేవ' అను గ్రంథమును రచించిన శ్రీ పి. రామమూర్తి గారు ఆంధ్ర పాఠక లోకమునకు సుపరిచితులు. వారికి మేము కృతజ్ఞతా బద్ధులము. గ్రంథమును నిర్దుష్టముగ, చక్కగ ముద్రించిన బి. వి. ఆర్. బాల్‌రెడ్డి అండ్ కంపెని వారికి మా కృతజ్ఞత.

హైదరాబాదు
తేది 30-10-75

దేవులపల్లి రామానుజరావు
కార్యదర్శి
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి

# తెలుగువారి సంస్కృత భాషాసేవ

## పూర్వయుగము

సంస్కృత భాషా వాఙ్మయ స్రవంతి భారతదేశము అన్ని ప్రాంతాలలోను ప్రవహించి సుసమృద్ధమైనది. అన్ని ప్రాంతాలవారు ఈ వాఙ్మయాన్ని పరిపోషించినారు. ముఖ్యంగా కాశ్మీరము, ఆంధ్రదేశము, కేరళదేశము, కాశీ, కాంచీవంటి మహానగరములు సంస్కృత సాహిత్యానికి ఆలవాలములైనవి. తెలుగువారు ఈ భాషా సాహిత్యానికి చిరకాలము నుండి చేసిన విశిష్ట సేవను ఆకళించుకోడానికి ప్రయత్నము చేయుదము.

సంస్కృతభాష, ఆర్యసంస్కృతి ఆంధ్రదేశములో సూత్రకాలము నాటికే స్థిరపడినవి. ఆపస్తంబ కల్ప సూత్రములు ఆంధ్రదేశముననే రూపొందినవని పండితుల అభిప్రాయము. కథా సరిత్సాగరములో వర్ణింపబడిన గుణాఢ్యుడు, శర్వవర్మ అనే సంస్కృతపండితులు శాతవాహనుల ఆస్థానాన్ని అలంకరించి యుండిరి. శాతవాహనుల రాణులు సంస్కృత విదుషీమణులనియు రాజులు కూడ సంస్కృత భాష నభ్యసించుటకై విశేష ప్రయత్నము చేసిరనియు మనకు తెలియుచున్నది. శర్వవర్మ వ్రాసిన కాతంత్ర వ్యాకరణము సంస్కృత భాషను సులభతరముగ బోధించుటకు విశేష సాధనముగా రూపొందినది. ఈ వ్యాకరణము చాల మహత్త్వము కలదని ఎందరో పండితులు చెప్పెదరు. గుణాఢ్యుడు కూడ గొప్ప సంస్కృత పండితుడేయనియు తన ప్రతిజ్ఞానుసారము పైశాచీ ప్రాకృతములో బృహత్కథను వ్రాసెననియు ఈ కథవలననే మనకు తెలియుచున్నది. ఈ బృహత్కథ స్వయముగాను సంస్కృతానువాదముల ద్వారాను సంస్కృత సాహిత్యాన్ని ప్రభావిత మొనర్చినది. ఆ కాలమున రాజభాష ప్రాకృతమైనప్పటికి సంస్కృతాభ్యాసము విరివిగ జరిగినట్లు అనేక ప్రమాణములవలన మనకు తెలియును. హాలుని సప్తశతిలోని అనేక గాథలు, ఆనాటి ప్రాకృత శాసనములు ఆంధ్ర దేశమున వేద శాస్త్రముల ప్రచారాన్ని సుస్పష్టంగా నిరూపించుచున్నవి. హాలుని ఈ గాథలు సంస్కృతమున వెలసిన అలంకార గ్రంథములలో ఉత్తమ కావ్యములకు లక్ష్యములుగా నుదాహరింపబడియుండుట ఎల్లరకు తెలిసిన విషయమే.

తెలుగు దేశములో బౌద్ధమతము అతి ప్రాచీన కాలములోనే
నది నాగార్జునుడు శ్రీ పర్వత ప్రాంతములో నివసించి తన సు
బౌద్ధ తత్త్వ గ్రంథాలను రచించినట్లు అనేకములైన ఆధారముల వ
తెలియుచున్నది. ఇతడు శాతవాహన రాజునకు వ్రాసిన సుహృల్లేఖ
దొరికినది. కాని ఇతని సంస్కృత గ్రంథములనేకములు నేడు చైనా,
భాషలలోని అనువాదముల మూలముననే తెలియవచ్చుచున్నవి. ఇవి
పది పదునైదు శతాబ్దములకు పూర్వము సంస్కృత మాతృకలనుండి
భాషలలోనికి అనువదింపబడినట్లు చెప్పుచున్నారు.

ఆంధ్ర దేశములో లభ్యమైన మొట్టమొదటి సంస్కృత శాస
ఇక్ష్వాకుల కాలము నాటివి. ఇవి సంస్కృత గద్య పద్యమయములై
కావ్యశైలిలో నున్నవి. అనాటి కొన్ని సంస్కృత శాసనములలో ధర
లను వారి ద్వారా సంస్కృత భాషలో బౌద్ధమత ప్రచారము జరు
నటుల చెప్పియున్నది. దీనిని బట్టి ఆకాలమున సంస్కృత ప్రాకృత
స్వతములు బౌద్ధ వైదిక ధర్మములును తోడ్తోడ వర్ధిల్లినవని చెప్పదగియ
మరికొన్ని శాసనములలో పేర్కొనబడిన బ్రాహ్మణులు ఋగ్యజుస్సావ
పండితులును ఆపస్తంబాది సూత్రవేత్తలునై యుండిరి

విష్ణుకుండినరాజులు అనేక యాగములుచేసినట్లు వారి శాసనము
తెలియవచ్చుచున్నది. వీరి సంస్కృత శాసనములు గంభీరమగు
చక్కని ఉత్ప్రేక్షలతో నిండియున్నవి. వైదికమతము,సంస్కృత సాహి
వీరి కాలములో బాగుగా వర్ధిల్లినవని చెప్పవచ్చును. నాల్గవ మాధవవర్మకు
శ్రయుడను నామాంతరము కలదు. "జానాశ్రయీ ఛందోవిచితి" యను
శ్శాస్త్రగ్రంథము ఈయనదేయని ప్రతీతి. ఈ లక్షణగ్రంథమునకు గుణ
యను పండితుడు వ్రాసిన వృత్తియు లభ్యమగుచున్నది. ఈ గ్రంథము
వృత్తజాతుల స్వరూపజ్ఞానమును పొందగోరువారికి మిక్కిలి యుపయో
ముగ నున్నది. గణప్రస్తారము, వానిపేర్లు ఇందు నూతనములు. ప్రా
సాహిత్యమున ప్రసిద్ధములైన అనేక వృత్తములు సంస్కృతమున ఆ
ప్రచారములో నున్నట్లు ఈ గ్రంథమువలన తెలియవచ్చుచున్నది. ఛం
పరిణామము తెలిసికొనుటకు ఈగ్రంథము చాల ఆవశ్యకము. ఇందుదాహరి
లక్ష్యశ్లోకములు కాళిదాసు, కుమారదాసు, భారవి, సుందరపాండ్యుడు,

నితంబ మున్నగు సంస్కృతకవుల రచనములైయున్నవి. ఎన్నియో లక్ష్య శ్లోకముల కర్తృత్వము తెలియదు. దీనివలన ఆనాటి సంస్కృత రచనలోని వైవిధ్యము తేటతెల్లమగుచున్నది.

ఈకాలముననే దక్షిణదేశమున ఘటికాస్థానములనెడి విద్యాకేంద్రములు నెలకొన్నవి. ఇందనేక పండితులు ఆచార్యులుగ నియుక్తులై యుండెడివారు. పల్లవుల కాలమునాటి కాంచీ ఘటికాస్థానముననున్న వివిధ వేదశాస్త్ర పండితులలో అధికభాగము తెలుగుదేశమువారే. ఇదే విధముగా నాటి బౌద్ధ విహారములును మహాయాన మత వ్యాప్తికేకాక సంస్కృత విద్యావ్యాప్తికిని తోడ్పడినవి. చాళుక్యుల శాసనములును పెక్కు వేదశాస్త్ర పండితులను పేర్కొనుచున్నవి. చాళుక్యరాజులుకూడ గొప్ప విద్వాంసులు, రాజనీతిజ్ఞులు, ధర్మశాస్త్రవేత్తలునై యుండిరి. వారు సాహిత్యమును లలితకళలనుకూడ పోషించిరి. మహాకవి భారవియు నతని మిత్రుడు దామోదరుడును వేంగీదేశప్రభువగు కుబ్జవిష్ణువర్ధనుని యొద్ద నుండిరని "అవంతి సుందరీకథ" వర్ణించుచున్నది. ఉగ్రాచార్యుడను నొక జైనవైద్యుడు క్రీ॥ శ॥ 800 ప్రాంతమున వేంగిదేశపు రాజగు విష్ణువర్ధనుని యాస్థానమున నుండినటుల తెలియవచ్చుచున్నది. ఇతడు వేంగీదేశములోని రామగిరి ప్రాంతమున కనక దీపిక, కల్యాణకారకము, జగత్సుందరి, భిషక్ప్రకాశము, రాజవినోదము అను నైదు వైద్యశాస్త్రగ్రంథములను రచించెను. చాళుక్యుల శాసనములలో శర్వవర్మ యను వేదవేదాంగపారగుడును, క్రమవేత్తయగు కొమ్మన పండితుడును, సోమశర్మయను వేదశాస్త్ర పండితుడును, తైత్తిరీయ శాఖాధ్యేతయగు పద్మభట్టారకుడును పేర్కొనబడియున్నారు. వీరు దేవాలయముల నెన్నింటినో నిర్మించి వాని నిర్వహణమునకై అగ్రహారములనిచ్చి వానిని గొప్ప విద్యాస్థానములుగను లలితకళా నిలయములుగను రూపొందించి యుండిరి.

తూర్పు చాళుక్యుల శాసనములన్నియు ప్రధానముగ సంస్కృత భాషలోనే యున్నవి. వీని యందా శాసనకవుల ప్రతిభావిశేషములు ప్రస్ఫుటముగా గోచరించుచున్నవి. కొన్ని శాసనములను చిన్న చంపూ కావ్యములనవచ్చును. శాసన కవులు కవివృషభాది బిరుదాంకితులై యుండిరి. ఈ శాసనములలో తెలుగు కన్నడ వాఙ్మయములలో ప్రసిద్ధములైన రగడ కంద పద్యములు

సంస్కృతమున వ్రాయబడినవి. ప్రాసయతియును కానవచ్చుచున్నది. ఆదికవియగు నన్నయభట్టు నందంపూడి శాసనమును వ్రాసెను. ఈ శాసనములన్నింటిలోను గద్యపద్య రచన విశిష్టకావ్యగుణములతో కూడి మనోహరముగా నున్నది. నన్నయభట్టు చేసిన విష్ణువర్ధనుని వర్ణనము, విద్దయభట్టు చేసిన రాజరాజనరేంద్రుని వర్ణనము నిట ఉదాహరింప వచ్చును.

యస్య స్ఫారభుజాకృపాణ దళితారాతీభకుంభ స్థల-
ప్రోన్ముక్తామలవృత్తమౌక్తికచయః సంగ్రామ రంగాంతరే.
ధత్తే వీరరసక్రియాభి నయన ప్రస్తావనా లక్షితం
వీరశ్రీ రచితాంజలి ప్రవిసరత్పుష్పోపహారశ్రియః॥

యో రూపేణ మనోభవం విశదయా కాన్త్యా కళానాం నిధిం
భోగేనాపి పురందరం విపులయా లక్ష్మ్యా చ లక్ష్మీధరమ్।
భీమం భీమ పరాక్రమేణ విహసన్నాతిస్మ భాస్వద్యశాః
శ్రీమత్సోమకులైకభూషణమణిః దీనైకచింతామణిః॥

వేములవాడ చాళుక్యులు యశస్తిలక చంపూకర్తయగు సోమదేవసూరిని పోషించిరి. కొండపడమటి రాజుల ఆస్థానమున కవివల్లభుడను పండితుడు పదమంజరి, గణమంజరి యను రెండు పదకోశములను వ్రాసెను. బుద్ధనృపాలు డితనిని సంపదల నొసగి సత్కరించి యుండెను. భల్లటకవి ద్రాక్షారామ భీమేశ్వరుని దయకు పాత్రుడై కవిత్వశక్తిని సంపాదించినటుల చెప్పికొని యున్నాడు. ఈయన గ్రంథములు కవిజనోప జీవ్యములు.

తూర్పుచాళుక్యుల కాలముననే తెలుగున ఆదికావ్యము వెలసినది. నన్నయయు తరువాత తిక్కనయు కావ్యారంభమున సంస్కృత శ్లోకములను వ్రాసిరి. ఆంధ్రశబ్దచింతామణి యను సంస్కృతములో నున్న తెలుగువ్యాకరణము కూడ నన్నయ కృతమేయని కొందరి అభిప్రాయము. నాటి తెలుగు కవు లాదరించిన భాషయు సంస్కృతపద భూయిష్ఠమై సంస్కృత కావ్యలక్షములనే అనుసరించి యుండుట గమనార్హము. అప్పటి తెలుగు పండితులును కవులును సంస్కృత ప్రాకృతములయందు గొప్పపండితులై యుండిరి.

# ఓరుగల్లు కాకతీయులు

ఆంధ్ర దేశమున కాకతీయుల కాలము సాహిత్యమునకు లలిత కళల కును వసంతాగమము. కాకతీయ రాజులు జైన వైదిక శైవ మతములను తర్క వేదాంత వ్యాకరణాది శాస్త్రములను, సంగీతము, నాట్యము మున్నగు లలిత కళలను విశేషముగ పోషించి యుండిరి. కాకతీయ శాసన కవులానాటి సుప్రసిద్ధ కవి పండితులై యుండిరి. రామేశ్వర పండితుని కుమారుడైన అచింతేంద్రదేవుడు హనుమకొండ శాసనకర్త. ఇతడు శైవమత వ్యాప్తికై తన జీవిత సర్వస్వమును ధార పోసినాడు.

యత్ర ద్విజేంద్ర భవనేషు నివార్యమాణా॥
కీరాః పఠంతి పటవో వటుభిస్సమేతాః
సర్వాంగ సంగత సమస్త విచార చారు
చారిత్ర చర్చిత పదక్రమయుక్త వేదాన్.

ఇతర శాసన కవులలో కవి చక్రవర్తులు, బాలభారతులు, అభినవ మయూరులు, బంధ కవిత్వ నిపుణులు ఎందరో యుండిరి. నిష్కంఠ్యాది చిత్ర కవిత్వ విశారదుడైన ఈశ్వర భట్టోపాధ్యాయుడు, యజుర్వేద పారంగతుడును పాణినీయ వ్యాకరణ శాస్త్రవిశారదుడునై యుండెను. అతిక్లిష్టములగు బంధ కవిత్వ రీతుల నభ్యసించి తన శాసన రచనము నందును గుంభించి యున్నాడు.

నృసింహ నామధేయుడగు నొక మహాకవి వరంగల్లు కోటలోని కొన్ని శాసనములను వ్రాసెను. ఇతడు ఋగ్వేదమునకును ఇతర శాస్త్రములకును వ్యాఖ్యానముల వ్రాసితినని చెప్పుకొనినాడు. ఇతని కాకతీయచరిత్ర మహాకావ్యములోని కొంత భాగ మీ శాసనముల కానవచ్చుచున్నది. ఒక శ్లోకము ఎనిమిదవ సర్గలోని చివరి భాగముగా చెప్పబడినది. హనుమకొండలోని ఒక శాసనములో ఏకశిలా నగరమును వర్ణించు అరువది శ్లోకములు కానవచ్చు చున్నవి. అవియు పై నృసింహకవి వ్రాసిన కాకతీయచరిత్ర మహాకావ్యము లోనివే యని పండితుల అభిప్రాయము. మరియొక శాసనములో తనను రూప

కేశుడని వర్ణించుకొని యున్నాడు. మరియునందు మలయవతి యనెడి గద్య ప్రబంధ మొకటి ఈయన కృతిగా చెప్పబడినది.

> అప్రాప్త సభా స్తంభోఽప్య విపన్న హిరణ్యకశిపు రపి
> అవికృతముఖోఽపి దిశను ప్రగల్భతే రూపకేశ నరసింహః"
> మలయవతీ నామ్ని గద్య కావ్యే.

దీనిని బట్టి కాదంబరీ కల్యాణ నాటక కర్తయగు నరసింహకవియు పై శాసన కవియు నొకరే కావచ్చు నందురు.

వరంగల్లు సమీపమున నున్న ఒక గుట్టపైగల శిలాఫలకములలో అరువది శార్దూలవిక్రీడిత శ్లోకములు చెక్కబడి యున్నవి. శాసనాంతమున "నరసింహార్యే కృతిః" అని యున్నది. ఇతడు పై నరసింహకవి కాకపో వచ్చును. ఈ శ్లోకములలో నొక సిద్ధదంపతుల ప్రణయగాథ మనోహర ముగ వర్ణింపబడినది. విప్రలంభ శృంగారము, చంద్రోదయము మున్నగు వాని వర్ణనలు హృదయంగమములుగా నున్నవి. మదనుడు ప్రేమికులను ఎట్టి అవస్థలు పెట్టునో ఇటుల వర్ణించినాడు.

> తిష్ఠత్యుచ్చలతి ప్రయాతి పునరప్యాయాతి సంభాషతే
> తూష్ణీంభావముపైతి పశ్యతి భువః సమ్మీలయత్యక్షిణీ,
> ఉద్భ్రామ్యత్యధికం దధాతిచ ధృతిం నిశ్చేష్టతే చేష్టతే
> హా కష్టం మదనేన దారుణతరం కిం కిం న సా కార్యతే॥

అపూర్వములగు ఈ శాసనములలోని శిలాంకితములైన మనోహర గద్య పద్య కావ్యముల చూచిన కాకతీయ మహారాజులకు సంస్కృత భాషయందుగల ఆద రాతిశయము స్పష్టము కాగలదు.

పై శాసన కవులేకాక కాకతీయుల కాలములో ఆంధ్ర దేశమున పెక్కురు సంస్కృత కవులు పండితులు విలసిల్లి యుండిరి. గణపతిదేవుని సేనానియగు జాయప, నృత్త నాట్య సంగీతముల ప్రవీణుడై "నృత్త రత్నావళి" యను అపూర్వ గ్రంథమును విరచించియుండెను. ఇందు మార్గ, దేశీ నృత్యములను సలక్షణముగా నిరూపించుచు మానసోల్లాసము, అభినవ భారతి మున్నగు ప్రాచీన లక్షణ గ్రంథములతో నాటి నాట్య సంప్రదాయాలను సమన్వయపరచి

యుండెను. ఇతడు "గీత రత్నావళి" యను సంగీత లక్షణమును కూడ వ్రాసి నట్లు తెలియుచున్నది.

రుద్రమదేవ కుమారుడు విరచించిన అమరుకశతక వ్యాఖ్యయొకటి ఇపుడు లభ్యమగు చున్నది. ఈ రుద్రమదేవ కుమారుడు కాకతీయ ప్రతాప రుద్రుడేయై యుండును. ఇతడు యయాతి చరిత నాటకము మున్నగు గ్రంథ ములను కూడ వ్రాసెనని ప్రతీతి. ఇతని ఆస్థానమున నెందరో సంస్కృత కవి పండితులుండిరి. అప్పయార్యుడను నొక జైన పండితుడు జినేంద్ర కల్యాణా భ్యుదయమును వ్రాసెను. కొలని రుద్రదేవుడు ప్రతాపరుద్రుని ప్రధానియైన మనుమ గన్నయ కుమారుడు. ఇతడు గొప్ప వ్యాకరణ పండితుడై వ్యాకరణ బ్రహ్మయని విఖ్యాతి గాంచెను. వరరుచి వ్రాసిన శ్లోకరూప వార్తికముల కీయన రాజరుద్రీయమను పేర ఒక వ్యాఖ్యానమును వ్రాసెను. పాణినీయ వ్యాకరణ ప్రపంచవృత్తియను మరియొక గ్రంథముకూడ ఇతనిదే కావచ్చును.

రాజమహేంద్ర సోమయాజి కుమారుడగు గుండామాత్యుడు గొప్ప వేదాంతి. ఇతడు వేదశాస్త్ర పండితుడై ప్రతాపరుద్రుని ఆస్థానమున బ్రాహ్మ ణాధికారిపదని నలంకరించియుండెను. అద్వైత వేదాంతమున సుప్రసిద్ధమైన శ్రీహర్షుని ఖండన ఖాద్యమునకు ఈయన యొక వ్యాఖ్యానమును వ్రాసెను. విద్దనాచార్యుడను మరియొక ఉద్దండ పండితుడు పూర్వోత్తర తంత్ర సార భూతమైన ప్రమేయ చర్చామృతమను శాస్త్రగ్రంథమును వ్రాసినటుల శాసనా ధారముల మూలమున తెలియుచున్నది.

సుప్రసిద్ధమగు ప్రతాపరుద్ర యశోభూషణమును వ్రాసిన విద్యానాథుడు ప్రతాపరుద్రుని కాలమునాటి సంస్కృత కవులలో ముఖ్యుడు. కొన్ని కథల మూలమువ ఇతడీ గ్రంథమును ఓరుగల్లు పతన సందర్భమున వ్రాసెనని చెప్ప వచ్చును. తొమ్మిది ప్రకరణములలో నీ గ్రంథము దృశ్య శ్రవ్య కావ్య లక్ష ణములను సమగ్రముగా నిరూపించుచున్నది. కొన్ని అలంకారముల యొక్కయు, క్షుద్రప్రబంధముల యొక్కయు లక్షణము లిందలి విశేషములు, ఈ కృతి మల్లినాథాది మహావ్యాఖ్యాతల ఆదరము నందినది. ఉదాహరణ శ్లోక ములను ప్రతాపరుద్ర కల్యాణ నాటకమును కాకతి ప్రతాపరుద్రుని ప్రశంసా పరమై యున్న ఈ గ్రంథము యశోభూషణమనదగు ఒక నూతనమైన

అలంకార లక్షణ ప్రక్రియకు నాందియైనది. అర్వాచీన కాలమున దక్షిణ దేశమున వచ్చిన పెక్కు అలంకార గ్రంథము లీప్రక్రియనే అనుసరించినవి. లక్షణకరణమున ప్రసిద్ధులగు పూర్వాలంకారికుల ననుసరించుచు తన ప్రతిభతో మనోహరములైన లక్ష్యములు నిర్మింపబడినవి. మల్లినాథసూరి కుమారుడగు కుమారస్వామి సోమపీథి దీనిపై రత్నాపణమును నొక ప్రౌఢ వ్యాఖ్యానమును వ్రాసెను. పదునెనిమిదవ శతాబ్దమున చిలకమర్తి తిరుమలాచార్యుడు ప్రతాపరుద్రీయమునకు రత్నశాణ వ్యాఖ్యానమును వ్రాసెను.

ఈ కాలముననే గొప్ప ప్రతిభా విశేషములుకల అగస్త్యనామధేయుడైన మరియొక మహాకవియు విలసిల్లి యుండెను. ఇతడు డెబ్బది నాలుగు కావ్యములను విరచించి యుండినటుల గంగాదేవి తన మధురా విజయములో వర్ణించినది, ఇతని వైదుష్యమును రాజ చూడామణి దీక్షితులు మున్నగు కవి పండితులెందరో వేనోళ్ళ పొగడి యున్నారు. అతని మేనల్లుడును, గంగాదేవికి గురువునైన విశ్వనాథ పండితుడు సౌగంధికాహరణ వ్యాయోగ కర్త. కాదంబరీ కల్యాణ కర్తయైన నరసింహుడునూ ఈయన మేనల్లుడే. ఇతని బావగారైన గంగాధరుడు మహాభారతమును నాటక రూపమున వ్రాసి యుండెనట.

ఈ అగస్త్యపండితుడు ప్రతాపరుద్రుని సమకాలికుడే యగుటవలన కొందరు పండితు లితడును విద్యానాథుడునూ ఒకరే యనువాదమును లేవదీసిరి. ఇందుకు ప్రోద్బలకముగా ప్రతాపరుద్రీయము కావ్య ప్రకరణములోని "ఔన్నత్యం యది వర్ణతే...జాతో౽స్మ్యగస్త్యః స్థితః త్వత్పార్శ్వే - గుణరత్న రోహణగిరే శ్రీ వీరరుద్ర ప్రభో!" అను శ్లోకమును చూపించుచున్నారు. విద్యానాథుడనునది బిరుదమనియు అగస్త్యుడనునది ఈ కవి నిజనామధేయమనియు వీరి యభిప్రాయము. కాని ప్రతాపరుద్రీయమున ఎక్కడను అగస్త్య శబ్దమును కవిపరముగ తీసికొనక పోయినను సమన్వయము కుదురును. ఇద్దరి వ్యక్తి లక్షణములును మిక్కిలి భిన్నములు. కావున ఈ వాదము నిరాధారమని తేలుచున్నది.

అగస్త్యుని కృతులు మూడు మాత్రమే ఇపుడు దొరకుచున్నవి. ఇరువది సర్గలు కల ఈతని బాల భారత మహాకావ్యము మహాభారత కథను సంగ్రహముగా వర్ణించుచున్నది. శ్రీకృష్ణదేవరాయల మహామంత్రి యగు తిమ్మరుసు

దీనికి "మనోహర" వ్యాఖ్యను వ్రాసియుండుట గొప్పవిశేషము. ఈ మహాకవి రచన సుప్రసిద్ధమగు వైదర్భీరీతిలో నడచినది. ఈ కావ్యము దక్షిణదేశమున బహుళప్రచారములో నుండినదనుట కొక నిదర్శనము తమిళములోని విల్లిభారతము దీని ననుసరించి యుండుటయే.

ఆనీతయా ఝడితి తేన తథేతి గత్వా
పాంచాలరాజ సుతయా స్థితయా సభాన్తే
బాష్పాంబు శీకరరుచా ధృతరాష్ట్రజానా
ముత్పాత వారిధరలేఖికయా బభూవే॥

భాగవతము నాధారముగా గైకొని శ్రీకృష్ణ చరిత మను నొక చిన్న గద్యకావ్యమును కూడ ఇతడు వ్రాసియుండెను. ఇది సరళమును మనోహరమునై హృదయంగమములైన వర్ణనములతో బాణుని కవిత్వచ్ఛాయలు కలిగి యున్నది. అగస్త్యుని మూడవకృతి నలకీర్తికౌముది. ఈ కావ్యముయొక్క ద్వితీయ, చతుర్థసర్గలు మాత్రమే లభ్యమగుచున్నవి. శ్రీహర్షుని నైషధీయ చరితమునకన్న నిది యతి సరళమును, ప్రసన్న గంభీరమునై సహృదయ శ్లాఘ్యమైనది. వసుచరిత్రములోని సుప్రసిద్ధమైన "నానాసూన వితాన వాసనల" యనెడి పద్యములోని భావమునకు మూలము నలకీర్తి కౌముదిలోని ఈక్రింది శ్లోకమని పండితుల అభిప్రాయము.

భృంగానవాప్తి ప్రతిపన్న ఖేదా
కృత్వా వనే గంధవలీ తపోఽలమ్,
తన్నాసికా భూదనుభూత గంధా
స్వపార్శ్వనేత్రీ కృత భృంగసేవ్యా॥

విశ్వనాథుని సౌగంధికాహరణమను ప్రేక్షణకమను ఒక రూపకప్రక్రియా విశేషముగా కవి వర్ణించియున్నాడు. కాని ఇది వ్యాయోగమున కుదాహరణముగా సాహిత్య దర్పణమున చెప్పబడినది. ఇందు వీరాద్భుతరసములు బాగుగా వర్ణింపబడినవి. ఈ విశ్వనాథుడే గంగాదేవి గురువు. నరసింహుని కాదంబరీ కల్యాణము సుప్రసిద్ధ గద్యకావ్యమైన బాణుని కాదంబరికి నాటకీకరణము. ఇందెనిమిది అంకములు కలవు. ఇందు కథ చంద్రాపీడుడు కిన్నరమిథునము ననుసరించిన ఘట్టమునుండి ఆరంభమైనది. మహాశ్వేతావృత్తాంతము

కాదంబరీ కృతమగు ఒక మహాశ్వేతాపుండరీక మనెడి అంతర్నాటకముగా ప్రవేశ పెట్టబడినది. వైశంపాయనుడును,వలాహకుడును ఈనాటకప్రేక్షకులుగా వర్ణింపబడినారు. ఎనిమిదవ అంకమున రోహిణి తన ఇంద్రజాల మహిమచే ఒక దృశ్యమును చూపించుచు శూద్రక కథను చెప్పును. ఇందభిజ్ఞాన శాకుంతలము నందలి" రమ్యాణి వీక్ష్య మధురాంశ్చ నిశమ్య శబ్దాన్..." అనెడి శ్లోకము అంతర్నాటకాంతమున వలాహక ముఖమున అత్యంత సముచితముగ చెప్పబడినది.

శాకల్య మల్లుడను పండితకవియు ప్రతాప రుద్రుని ఆస్థానము నలంకరించి యుండెను. ఇతనికిని సుదర్శనమిత్రుడను మరియొక పండితునకును జరిగిన వాదవివాదములను ప్రతాపచరితమను గ్రంథము వర్ణించుచున్నది. శాకల్యమల్లు డాతనిని ఓడించి ప్రభువు మన్ననలకు పాత్రుడయ్యెను. గురుపరంపరా ప్రభావమను వైష్ణవ గ్రంథమున వేదాంతదేశికులు, సింగమనాయని ఆస్థానమున కరుదెంచిరనియు అచట శాకల్యమల్లుడను నొక కవిని కలిసికొని ఆతని దుష్టవ్యూహమును నిర్జించెననియు వర్ణింపబడియున్నది. ప్రసంగ రత్నావళి యనెడి పద్యసంగ్రహములో శాకల్యమల్ల కృతమై హరిహరమహారాజస్తోత్ర పరమైన యొక శ్లోకము ఉద్ధృతమైనది. దీనినిబట్టి ఈయన విజయనగరాధీశుడైన మొదటి హరిహరరాయల ప్రాపున నుండినట్లును తెలియుచున్నది. ఇతడు చతుర్భాషా పితామహుడు. శ్రీరామకథా వర్ణన పరమైన ఉదారరాఘవ మహాకావ్యము నితడు రచించెను. అందు తొమ్మిది సర్గలు మాత్రమే ఇపుడు దొరకుచున్నవి. కథ శూర్పణఖా వృత్తాంతము వరకు నడచినది. స్వప్నమున శ్రీరాముని కటాక్షమునకు పాత్రుడై సాహిత్యవిద్యలో నీయన ప్రావీణ్యమును సంపాదించెనట. ఈ కావ్యమునకు చండిపండిత కృతమగు ప్రద్యోతనీ వ్యాఖ్యయు, రాంపల్లి గోపీనాథ కృతమగు మరియొక వ్యాఖ్యయు కలవు. ఈ మహాకావ్యము భట్టికావ్యమును పోలియున్నది. వ్యాకరణ సూత్రములకు లక్ష్యములను చూపుటకై ప్రౌఢప్రయోగము లనేకము లిందు చొప్పింపబడినవి. అటులనే శబ్దార్థాలంకారములకును వివిధ వృత్తములకును ఉదాహరణము లిందు చేర్చబడినవి. ఈ కావ్యము చదువరులకు మంచి శాస్త్రజ్ఞానమును కలిగించుననుటలో నెట్టి సందేహమును లేదు. ఈయన రామకథా పరముగనే మరియొక మహాకావ్యమును నిరోష్ఠ్యముగ వ్రాసినట్లు తెలియుచున్నది.

ఇతడు వ్రాసిన ఆఖ్యాతచంద్రిక సంస్కృతక్రియారూపములను అతిసులభముగ పరిచయము చేయుచున్నది. వ్యవహారములో తరచుగా వచ్చు క్రియలన్నింటియొక్క రూపములిందు కలవు. వేదములో నుపయుక్తములైన క్రియలుసైతమిందీయబడినవి. సుబన్త పదజ్ఞానమునకు అమరసింహుని నామలింగానుశాసనమువలె తిఙంత పదముల జ్ఞానమునకు ఈ ఆఖ్యాతచంద్రిక అత్యంతము ఉపయోగపడుచున్నది. మల్లినాథుడు, కుమారస్వామి, రాఘవభట్టు మున్నగు సుప్రసిద్ధవ్యాఖ్యాతలు ఈ గ్రంథమును ప్రామాణికముగా ఉదాహరించి యున్నారు. రామచంద్ర పండితుడు దీనిని క్రియాకోశ మనుపేర సంగ్రహముగ వ్రాసియున్నారు. కవిసారంగుడను మరియొక పండితుడును దీని సల్గ్రహమును ప్రయుక్తాఖ్యాత మంజరియను పేర రూపొందించినాడు. అవ్యయ సంగ్రహ నిఘంటు వనునది ఈయన వ్రాసిన మూడవగ్రంథము. ఇందు సంస్కృతము నందలి అవ్యయ పదములు ఏకాక్షర ద్వ్యక్షర క్రమమున చెప్పబడినవి. ఇంతగా ఉపయోగకరములైన ఈ గ్రంథములు నేడు ఆంధ్రదేశమున అంతగా ప్రచారములో లేకుండుట శోచనీయము.

నాట్యకళా ప్రపూర్ణుడగు వీరభల్లట దేశికుడును ప్రతాపరుద్రుని ఆస్థానమున ఉండెను. శృంగారశేఖరుని అభినయలక్షణ మను గ్రంథమున ఈతడు తన నాట్యశేఖరములో ప్రతిపాదించిన లక్షణములు సంగ్రహముగా చెప్పబడినవి. ఈ గ్రంథమిపుడు లభ్యమగుట లేదు. వల్లభామాత్యుని క్రీడాభిరామమునకు మాతృకయైన ప్రేమాభిరామమను సంస్కృత రూపకము రావిపాటి త్రిపురాంతకుడు వ్రాసియుండెను ఇతడు త్రిపురాంతకోదాహరణము మున్నగు కృతులను కూడ వ్రాసినట్లు చెప్పుదురు. ప్రేమాభిరామము క్రీడాభిరామమువలె వీథియనెడి రూపక ప్రబంధమే కావచ్చును. పెదకోమటి వేమ భూపాలుడు తన సాహిత్య చింతామణిలో ప్రేమాభిరామములోని కొన్ని శ్లోకములను ఉదాహరించి యుండవచ్చునని పండితుల అభిప్రాయము. ఈ ప్రేమాభిరామము తెలుగులోనికి ద్విపద కావ్యరూపమునను అనువదింపబడినదట.

సుప్రసిద్ధ వీరశైవమతాచార్యుడైన పాల్కురికి సోమనాథుడును ఇప్పటివాడే. ఇతడు సంస్కృతము తెలుగు కన్నడ భాషలలో మహాపండితుడు. సోమనాథ భాష్యము, రుద్రభాష్యము ఈయన పాండిత్య పటిమను ప్రకటించు

-చున్నవి. వీరశైవ మతమును శ్రుతి స్మృతి పురాణాగమ ప్రమాణములతో ప్రతిష్ఠాపించిన కీర్తి ఈయనను దక్కినది. ఇతడు సంస్కృతమున వ్రాసిన లఘుకృతులనేకములు వినూత్న ప్రక్రియలలో రూపొందినవి. పంచప్రకార గద్య, నమస్కారగద్య, అక్షరాంకగద్య, బసవోదాహరణము, వృషభాష్టకము, త్రివిధ లింగాష్టకము నీయన కృతులు. గద్య అనునదియు నొక ఛందో విశేషమే. కలిక, ఉత్కలిక మున్నగువానితో గూడి ఒక్కొక్క విభక్తితో వ్రాసిన స్తుతి పరములగు కావ్యములు ఉదాహరణ కావ్యములని చెప్పబడు చున్నవి. ఇట్టి ప్రక్రియా విశేషములు మొదట కన్నడమునను తెలుగునను ప్రచారములోనికి వచ్చినవి. వానిని సంస్కృత వాఙ్మయమున ప్రచారములోనికి తెచ్చినవాడు పాల్కురికి సోమనాథుడే. తరువాత కాలమున మన దేశములో ఈ ప్రక్రియలు సంస్కృతమునను ఎక్కువగా అదరింపబడియుండుట గమనింపదగి యున్నది. ప్రతాపరుద్రీయము మొదలుకొని ఆంధ్రదేశమున రచింపబడిన అలంకార లక్షణ గ్రంథములలో ఈ ప్రక్రియా లక్షణములు సోదాహరణముగ నిరూపింపబడుటయు విశేషమే.

కాకతీయుల కాలమున రచింపబడిన ఉత్తమ తెలుగు కావ్యములు సంస్కృత మహాకావ్యముల అనువాదములే. రామాయణ మహాభారతములు, మార్కండేయ పురాణము, దశకుమార చరిత మున్నగువానిని సుప్రసిద్ధులైన తెలుగు కవులు అనువదించి యుండిరి. నన్నెచోడుని కుమారసంభవముపై ఉద్భటవిరచితమైన కుమారసంభవము యొక్క ప్రభావము సుస్పష్టముగా కానవచ్చుచున్నది. తిక్కన నిర్వచనోత్తర రామాయణము సంస్కృత మహాకావ్యముల రీతి ననుసరించినది. పాల్కురికి సోమనాథుడు వేదవేదాంగ పారగుడగుట సుప్రసిద్ధము. తెలుగు భాషలో మహాకవియైన తిక్కనను సంస్కృత కవయిత్రియగు గంగాదేవి తన మధురా విజయ మహాకావ్యమున కీర్తించుట మిక్కిలి విశేషము. ఈ విధముగ సంస్కృత సాహిత్యము, వేద శాస్త్రములు కాకతీయుల కాలమున ఆంధ్ర దేశమున మిక్కిలి మక్కువతో అభ్యసింపబడి యుండుట గమనింపదగియున్నది.

# రెడ్డిరాజులు - వెలమ నాయకులు

కాకతీయ సామ్రాజ్య పతనానంతరము ఆంధ్రప్రభుత్వము మూడు చీలికలైనది. కొండవీటిలో రెడ్డిరాజ్యము, రాచకొండలో వెలమనాయకుల ప్రభుత్వము, విజయ నగరమున రాయల ఆధిపత్యము నెలకొనినవి. వైదిక మతమును సంస్కృత సాహిత్యమును పునరుద్ధరించుటకు వీరు ముప్వురును బద్ధ కంకణులైరి. కవులను పండితులను పోషించుట, కృతుల నంకితముగ పొందుట రాజులకు, మంత్రులకు సామంతులకు విశేష ధ్యేయములైనవి. తత్ఫలితముగ వేద శాస్త్రములు, సంగీతము, సాహిత్యము ఆంధ్ర దేశమున సముజ్జ్వల వికాసము నందినవి. సంస్కృత వాఙ్మయములోని ఉత్తమగ్రంథములన్నియు ఈ కాలమున వ్యాఖ్యానింపబడినవి. సాయనుని వేద భాష్యములు, మల్లినాథుని మహాకావ్య వ్యాఖ్యానములు కాటయవేముని కాళిదాస నాటక త్రయ వ్యాఖ్యలు ఈ కాలములోనే వెలసినవి. అటులనే అనేక సంస్కృత కావ్యములును లక్షణ గ్రంథములను కోకొల్లలుగ పుట్టినవి.

కాపయ నాయకుని ప్రోలవరపు శాసనములో ప్రతిగ్రహీతగా పేర్కొనబడిన కందాయ పెద్దిభట్టు శ్రీశైల క్షేత్రమున సత్రయాగ మొనరించి శివసహస్రనామ వ్యాఖ్యను వ్రాసియుండెను. రెడ్డి రాజుల సంస్కృత శాసన కవులుగ బాలసరస్వతి, త్రిలోచనాచార్యుడు, ప్రకాశ భారతీయోగి తెలియ వచ్చుచున్నారు. వీరి శాసన కావ్యములు ఉత్తమ కవితా గుణములతో విరాజిల్లుచున్నవి. వసంతరాయలని పేరుగాంచిన కుమారగిరిరెడ్డి సంగీత నాట్యములయందు అసమాన పాండిత్యము గలవాడై ఉండెను. ఇతనికి కలావంతుడను బిరుదము కూడ కలదు. వసంతరాజీయమనెడి నాటక లక్షణ గ్రంథమీయన కృతి. కాటయవేముని వ్యాఖ్యాలలో నిది బహుళముగ నుద్ధృతమైనది. కాటయవేముడు తన వ్యాఖ్యానములన్నింటిని కుమారగిరిరాజీయములను పేర వ్రాసియుండెను. ఈ లక్షణ గ్రంథము నుండి శ్లోకములను మల్లినాథుడు శిశుపాలవధ వ్యాఖ్యానములోను, నాదెండ్ల గోపమంత్రి తన ప్రబోధచంద్రోదయ వ్యాఖ్యానములోను ఉదాహరించిరి. కాని ఈ గ్రంథమిపుడు లభ్యమగుటలేదు. కుమారగిరిరెడ్డి యానతిపై కాటయవేముడు కాళిదాస నాటకత్రయమునకు

వ్యాఖ్యానములు వ్రాసి యుండెను. ఈ వ్యాఖ్యానములలో ఆతడు వసంత రాజీయములోని లక్షణములనే అనుసరించియుండెను. ఈయన వ్యాఖ్యానములు పండితమాన్యము లైనవి.

పెద కోమటి వేమ భూపాలుడు కవి పండిత పోషకుడగుటయే కాక స్వయముగను కవియై సర్వజ్ఞ బిరుదాంకితుడై యుండెను. సంగీతమునను సాహిత్యమునను ఈయన దిట్ట. సాహిత్య చింతామణి నీయన పదమూడు పరిచ్ఛేదములతో వ్రాసెను. ఇది మమ్మటుని కావ్య ప్రకాశమును బోలియున్నది. ఇందు సమకాలీన కవుల కృతుల నుండియు ఉదాహరణముల నిచ్చి యున్నాడు. వానిలో చెప్పదగినవి నరసింహుని కాదంబరీ కల్యాణము, విశ్వనాథుని సౌగంధికాహరణము తనవియేయగు కావ్య భాణ ప్రహసనములు. ఇతడు సంగీత చింతామణి యను సంగీత లక్షణమును కూడ వ్రాసెను.

పెదకోమటి వేమభూపాలుడు రెండు గొప్ప వ్యాఖ్యానములను కూడ వ్రాసియుండెను. శృంగార దీపికా వ్యాఖ్యానములను కూడ వ్రాసియుండెను. శృంగార దీపికా వ్యాఖ్య సుప్రసిద్ధ ముక్తక కావ్యమైన అమరుకముపై వెలసినది. ఇది ప్రౌఢమును సహృదయ సమ్మతమునై ప్రసిద్ధిగాంచి యున్నది. హాలుని గాథా సప్తశతి నుండి నూరు గాథలనెన్నుకొని వానిపై భావదీపిక యను మనోహరమైన వ్యాఖ్యానమును కూడ ఇతడు వ్రాసెను. ఈయన ఎన్నుకొనిన గాథలు ముఖ్యముగ గోదావరి తీరము, పల్లె సీమలు, పండుగలు మున్నగు విషయములను పరామర్శించునవియై ఉదాత్త భావస్ఫోరకములై యుండుట గమనింపవలసి యున్నది. ధ్వని సిద్ధాంతము ననుసరించి గాథలను చక్కగ వ్యాఖ్యానించి యున్నాడు. సుప్రసిద్ధాంధ్ర మహాకవి శ్రీనాథుడు ఈయనకి వ్యాఖ్యారచనమున తోడ్పడి యుండెనని కొందరి అభిప్రాయము. పెదకోమటి వేమభూపాలుని యాస్థానములో శ్రీనాథుడు విద్యాధికారిగానుండి యాతని సంస్కృత శాసనములను రచించియుండెను.

వేమభూపాలుని ఆస్థానము నలంకరించిన సుప్రసిద్ధ సంస్కృత కవులలో నగ్రగణ్యుడు వామన భట్టబాణుడు. ఇతడు విద్యారణ్యుని శిష్యుడు. మొదటి దేవరాయల యొద్ద దండాధినాథుడైన లక్ష్మీశుడు కూడ ఇతనిని ఆదరించినట్లు తెలియవచ్చుచున్నది. వ్యాకరణము, మీమాంస, న్యాయ శాస్త్రముల

యందు పండితుడై కవీశ్వరాది బిరుదాంకితుడై యుండెను. గద్య పద్య రచనా నిపుణుడగుటయే కాక ఈయన మొదటి దేవరాయల సంస్కృత శాసనము నొకదానిని కూడ రచించియుండెను.

వామన భట్టబాణుడు బాణుని హర్షచరితమును పోలిన వేమభూపాల చరితమను గద్య ప్రబంధమును రచించి గద్యకవి సార్వభౌమ బిరుదమును పొందెను. ఇందు బాణునిశైలియొక్క అనుకరణము సుస్పష్టంగా కన్పించుచున్నది. ఇంగలి దాక్షారామ వర్ణనము భీమఖండములోని శ్రీనాథుని వర్ణనను పోలి యున్నది. వేమ భూపాలుని దిగ్విజయము, వివాహము, పండిత సభ మున్నగునవి అతి మనోహరముగ వర్ణింపబడినవి. రఘునాథ చరితము, నలాభ్యుదయము, సీతని మహా కావ్యములు. రఘునాథ చరితమున ముప్పది సర్గలు కలవు. ఇందు రామకథ పట్టాభిషేక పర్యంతము వర్ణింపబడినది. రఘువంశ ఛాయలిందు ప్రకటముగా నున్నవి. నలాభ్యుదయ మహాకావ్యము యొక్క ఎనిమిది సర్గలు మాత్రమే లభ్యమగుచున్నవి. లక్ష్మీ పదాంకితమైన ఈ కావ్యము వీర రసమును, కరుణ రసమును బాగుగా పోషించియున్నది. నలుడు పాదప్రక్షాళనము చేయకయే సంధ్యావందన మొనరించిన సమయమున అతనిని కలి యావేశించిన దను నైతిహ్యమిందు వర్ణింపబడినది.

వామన భట్టబాణుడు హంససందేశ మను ఖండకావ్యమును కూడ వ్రాసెను. మేఘసందేశమువోలె నిదియు మందాక్రాంతా వృత్తములోనే యున్నది. దక్షాభిధానుడగు ఒక యక్షుడు కైలాసమునుండి శాపవశమున ప్రవాసితుడై మలయ పర్వతమున నివసించుచూ తన ప్రేయసికి హంసద్వారా సందేశమును పంపుట ఇందలి ఇతివృత్తము. దక్షిణ దేశమునందలి నదులు, పర్వతములు, పట్టణములు ఇందు మనోహరముగా వర్ణింపబడినవి. కాళహస్తిని వర్ణించుచు దక్షిణ దేశమున ప్రసిద్ధములైన గాథలను కూడ నిటుల పరామర్శించినాడు.

అక్ష్ణోరగ్రే తదను భవితా కాళహస్తీ గిరిస్తే
తస్యోపాన్తే కనక ముఖరీ నామ కల్లోలినీ చ
తీరే తస్యాః కలిత వసతేర్మూర్ధ్ని శంభోః కిరాతో
గండూషాంబుస్నపన విధయా ప్రాప గంగాధరత్వమ్.

శృంగార భూషణభాణము, పార్వతీ పరిణయము కనకలేఖా కల్యాణము, బాణాసుర విజయము అనునవి ఇతని దృశ్యకావ్యములు. శృంగార భూషణ భాణముమ విరూపాక్ష దేవుని వసంతోత్సవ సందర్భమున విరచించియుండెను. ఇందు విలాస శేఖరుడను నొక విటుని యొక్కయు, అనంగ మంజరి యను నొక విలాసిని యొక్కయు ప్రణయ కలాపము వర్ణింపబడినది. బంతులాటలు, జూదములు, కోడిపందెములు, వేశ్యా వినోదములు, కుస్త్రీలు, మున్నగు వానిని కన్నులకు కట్టినట్లుగ నిందు కవి వర్ణించినాడు. కనకలేఖా కల్యాణమున విజయవర్మయను నొక విద్యాధరునకును కనకలేఖకును గల ప్రణయము నీకవి వర్ణించెను. హాస్యాద్భుత రసములిందు మనోహరముగా వర్ణింపబడినవి. బాణాసుర విజయమున ఉషానిరుద్ధ ప్రేమకథ వర్ణితమైనది.

పైన చెప్పిన కావ్యములనేకాక వామన భట్టబాణుడు శబ్ద చంద్రిక, శబ్ద రత్నాకరము అను రెండు సంస్కృత పదకోశములను కూడ నిబంధించియుండెను. శబ్ద చంద్రిక నూట ముప్పది శ్లోకములలో నున్న సంక్షిప్త నిఘంటువు. శబ్ద రత్నాకరము అమరకోశమువలె మూడు కాండలలో సంస్కృత శబ్దరాశిని విభిన్న వృత్తముల ద్వారా చెప్పుచున్నది. ఇందలి కొన్ని సంస్కృత శబ్దముల యర్థములు ఆంధ్ర దేశమున మాత్రమే వ్యవహారములో నున్నవి.

మామిడి సింగన మంత్రి జ్యోతిశ్శాస్త్రవేత్త. ఈయన సోమ సిద్ధాంతముపై గూఢార్థదీపిక యను వ్యాఖ్యానమును వ్రాసెను. ఇతడు శ్రీనాథాది మహాకవులనుకూడ ఆదరించి యుండెను పెదకోమటి వేమభూపాలుని ఆస్థానమున ఆయుర్వేద శాస్త్రజ్ఞులు కూడ ఉండిరి. పరహితవంశమునకు చెందిన శ్రీనాథ వందితుడను ఒక వైద్య శిఖామణి పరహిత సంహితయను ఒక వైద్య శాస్త్ర గ్రంథమును వ్రాసియుండెను

రాజ మహేంద్ర వరమున నేలిన రెడ్డి రాజులును సంస్కృత భాషను ఎక్కువగా పోషించియుండిరి. శ్రీ వల్లభుడు, సరస్వతీ భట్టు, శతపథి పండితుడు మున్నగు కవి పండితులు, వేదవేత్తలు వీరి యాశ్రయమున నుండిరి. కందుకూరు నేలిన శివలింగారెడ్డి స్వయముగ సంస్కృత పండితుడై భరతమత పతంగ బిరుదమును వహించి యుండెను. ఇతడు శ్రుతి సూక్తిమాల యను శైవ సిద్ధాంత గ్రంథముపై తత్త్వ ప్రకాశికా వ్యాఖ్యను వ్రాసెను. ఈశ్వర భట్టను ఒక పండితు నీతడు పోషించినట్లు తెలియవచ్చు చున్నది.

ఈ కాలమున వెలువడిన తెలుగు మహా కావ్యములును సంస్కృత సాహిత్యమున ప్రసిద్ధిపొందిన నైషధీయచరిత, హరివంశము, నృసింహ పురాణము మున్నగువాని అనువాదములే. అవధాన ప్రక్రియ. తెలుగునను, సంస్కృతమునను ఈ కాలముననే రూపొందినట్లు చెప్పవచ్చును. సమస్యాపూరణము. విద్వత్కవి సంవాదములు రాజసభలలో పరిపాటియైనవి. సంస్కృత పాండిత్యము, కవిత్వము తెలుగుదేశపు కవిపండితులకు కనీసపు యోగ్యతలైనవి.

రాచకొండ రాజ్యమేలిన వెలమనాయకులు సంస్కృత భాషాపోషణమున రెడ్డిరాజులతో స్పర్ధవహించి యుండిరి, వేమభూపాలునివలెనే సింగభూపాలుడును సర్వజ్ఞ బిరుదాంకితుడై సంగీతనాట్యములందు విశేషప్రావీణ్యము కలిగి యుండెను. సింగభూపాలుని అస్థానమునను విశ్వేశ్వరుడు, అప్పయార్యుడు మున్నగు కవిపండితులు విలసిల్లియుండిరి.

పశుపతి పండితుని కుమారుడైన నాగనాథకవి సింగభూపాలుని తండ్రియైన అనవోతనాయకుని యాస్థానమున నుండెను. ఇతడనవోత నాయకుని అయినవోలు శాసనమును సంస్కృతమున వ్రాయుటయేకాక మదనవిలాస భాణమునుకూడ వ్రాసెను. ఈ భాణమున రాచకొండలోని కల్యాణ నారాయణుని వసంతోత్సవము వర్ణింపబడినది. ఇతడు చమత్కార చంద్రిక వ్రాసిన విశ్వేశ్వరుని శిష్యుడు. అనవోతనాయకుడును సంస్కృతమున కవియై అభిరామరాఘవ నాటకమును వ్రాసినట్లు సింగభూపాలుని రసార్ణవ సుధాకరములో చెప్పబడియున్నది. మాదనాయకుని ఉమామహేశ్వర శాసనమును వ్రాసిన మాయిభట్టోపాధ్యాయుడు న్యాయవ్యాకరణ మీమాంసా శాస్త్రముల గొప్ప పండితుడై యుండెను.

వెలమనాయకులలో సుప్రసిద్ధుడు సర్వజ్ఞ సింగభూపాలుడు. రసార్ణవ సుధాకరము, సంగీత సుధాకరము, కువలయావళి ఈయన కృతులు. రసార్ణవ సుధాకరమున నీతడు నాట్యలక్షణమును చక్కగా నిరూపించి యుండెను. మల్లినాథుని వ్యాఖ్యలలో నీ గ్రంథము ప్రామాణికముగ నుదాహరింపబడినది. ఈ గ్రంథముయొక్క చివరి భాగమునకు నాటకపరిభాష యను నామాంతరము కలదు. దీనిలో నాటక లక్షణము సంక్షిప్తముగా నున్నది. ఇందుదాహరించిన లక్ష్యశ్లోకములు కొన్ని సమకాలీన సంస్కృత సారస్వతమునుండి గ్రహిం

బడినవి. వానిలో కందర్పసంభవమును తన కృతియు అనవోతుని అభిరామ రాఘవనాటకమును, విశ్వేశ్వరుని వీరభద్రవిజృంభణమును కలవు. స్వయముగ నతడు వ్రాసిన ముక్తక శ్లోకములుకూడ కొన్ని ఇందు కానవచ్చుచున్నవి. ఇతని సంగీత సుధాకరము శార్ఙ్గదేవుని సంగీత రత్నాకరముపై నొక గొప్ప వ్యాఖ్యానము. ఈ వ్యాఖ్యానమున నితడు తన కొలువులో కవిపండితులతోను కళాకోవిదులతోను చర్చించుచు గడించిన అనుభవ సారమును చొప్పించి యున్నాడు. ఈతని కువలయావళి నాటికకు రత్నపాంచాలిక యనెడి నామాంతరమును కలదు. ఇందలి ఇతివృత్తము కువలయావళీ శ్రీ కృష్ణుల వివాహము. కువలయావళి భూదేవి యవతారమే. ఆమెను నారదుడు రుక్మిణియొద్ద న్యాసముగ నుంచును. క్రమముగ శ్రీ కృష్ణునకును కువలయావళికిని ప్రేమ యంకురించుటను, పుష్పించి ఫలించుటను రుక్మిణీ సత్యభామల యీర్ష్యనూ కవి ఇందు మనోహరముగా వర్ణించి యున్నాడు.

సింగభూపాలుని యాస్థానమున నుండిన మహాపండితుడు విశ్వేశ్వర కవిచంద్రుడు. ఇతడు సింగభూపాలునికి విద్యాగురువు. తన గురువు కాశీశ్వర మిశ్రుడనియు ఆతని కృతి రసమీమాంసయనియు చమత్కారచంద్రికలో చెప్పకొని యున్నాడు. ఇతడు చమత్కార చంద్రికనేకాక వీరభద్ర విజృంభణమను డిమమును కరుణాకందళము మున్నగు కావ్యములనుకూడ వ్రాసి యుండెను.

విశ్వేశ్వర కవిచంద్రుని చమత్కారచంద్రిక చమత్కార ప్రధానముగ కావ్యానుశీలనము చేయు ఒక విశిష్టమైన అలంకారప్రకరణము. ఇందు కావ్యము చమత్కారజనక మనియు, చమత్కారమనగా లోకోత్తరాహ్లాదమనియు, రసము, అలంకారము, గుణము, రీతి, వృత్తి, శయ్యా, పాకము అను ఏడు అంగములును చమత్కార జనకములే యనియు నిరూపింప బడినది. కావ్యములు చమత్కారి, చమత్కారితరము, చమత్కారితమములని మూడు విధములు. చమత్కారచంద్రికలో కావ్యస్వరూప నిరూపణము చేయుచు నితడీవిధముగ వర్ణించినాడు

రమ్యోక్త్యర్థతనూజ్జ్వలా రసమయ ప్రాణాగుణోల్లాసినీ
చేతోరంజక రీతివృత్తి కవితాపాకం వయోవిభ్రమా

నానాలంకరణోజ్జ్వలా రసవతీ సర్వత్ర నిర్దోషతాం
శయ్యామంచతి కామినీవ కవితా కస్యాపి పుణ్యాత్మనః॥

విశ్వేశ్వరుడు నిరూపించిన యీ పద్ధతిని చమత్కార ప్రస్థానమనియు కొందరు పండితులు పేర్కొనియున్నారు. ఇందు గ్రంథాదియందుండు అక్షరముల యొక్కయు గణముల యొక్కయు శుభాశుభ ఫలములు చెప్పబడినవి.

బొమ్మకంటి అప్పయార్యుడను పండితుడుకూడ సింగభూపాలుని యాస్థానమున నుండెను. ఇతడు అమరకోశమునకు వ్యాఖ్యానమును రచించెను. అప్పయార్యుని శిష్యుడైన హరిహరపండితుడు అనర్ఘరాఘవమునకు తార్కికరక్షా సంగ్రహమునకును వ్యాఖ్యలు వ్రాసియుండెను. అప్పయార్యుని అమరకోశ వ్యాఖ్యలో దక్షిణావర్తనాధుడును ప్రతాపుడను కోశకర్తయు రుద్రుడను వాని యయాతి చరిత నాటకమునూ పేర్కొన బడియున్నవి.

సింగభూపాలుని యారవ కుమారుడగు మాదనాయకుడు రామాయణముపై రాఘవీయ మను ఒక వ్యాఖ్యానమును వ్రాసి యుండెను. ఈ విషయము ఆతని భార్య నాగాంబిక వ్రాయించిన నాగవరము శాసనములో నున్నది. ఈ వ్యాఖ్యానమిపుడు లభ్యమగుట లేదు.

గౌరన లక్షణదీపికయను ఒకేపేరుగల రెండు గ్రంథములను వ్రాసెను. వీనికి పదార్థదీపికయనియు ప్రబంధదీపికయనియు నామాంతరములు కలవు. రెండింటి యందును. గణముల యొక్కయు, అక్షరములయొక్కయు శుభాశుభ ఫలములు, ఉదాహరణాది క్షుద్రకావ్య ప్రభేదములు చెప్పబడినవి. లక్ష్యములుగా తెలుగు కావ్యములనుండి పద్యములనుకూడ ఈ కవి యిచ్చియున్నాడు.

# విజయనగరాధీశులు

ఆంధ్ర దేశమున సంస్కృత వాఙ్మయము విజయనగరాధీశుల చల్లని పాలనలో కడుంగడు వృద్ధినొందియుండెను. విద్యారణ్యుడు, సాయన మాధవులు వేదధర్మమును సంస్కృత విద్యను దేశమంతటను వ్యాపింప చేసినారు. మాధవాచార్యుడు సాయణాచార్యుడు, భోగనాథుడు అనుమువ్వురును మాయణ, శ్రీమతి యనువారల పుత్రులు. మాధవుడు విద్యాతీర్థులు, భారతీతీర్థులు, శ్రీకంఠుడు అనువారలయొద్ద విద్య నభ్యసించి యుండెను. ఇతడు విజయనగర రాజులకు మంత్రియై యుండెను. విద్యారణ్యులు శృంగేరీ పీఠమునకు చెందిన మఠాధిపతియై మతప్రచారమునకు తోడ్పడియుండెను. సాయణుడును మంత్రిగనే యుండెను. ఎన్నియో వేదవేదాంత గ్రంథములు, వ్యాఖ్యానములు, శాస్త్రములు, కావ్యములు విద్యారణ్యుని పేరను, మాధవుని పేరను, సాయణుని పేరను కూడ ప్రచారములో నున్నవి. వీని నన్నిటిని పరిశీలించినచో మనకు ఈ గ్రంథకర్తృత్వ విషయమున కొన్ని అంశములు తేటతెల్లము కాగలవు.

శృంగేరీపీఠ గురుపరంపరలోనివారు విద్యాతీర్థులు,విద్యారణ్యులు,భారతీతీర్థులు. అనుభూతి ప్రకాశిక, అపరోక్షానుభూతి దీపిక, సంగీతసారము అనునవి విద్యారణ్యుని కృతులే. దృగ్దృశ్యవివేకము, పంచదశి, వివరణప్రమేయ సంగ్రహము విద్యారణ్య కృతములో భారతీతీర్థకృతములో నిర్ణయించుట కష్టము. దేవ్యపరాధస్తోత్రముకూడ విద్యారణ్యునిదే కావచ్చును. మాధవాచార్యుడు జీవన్ముక్తి వివేకము, ఏకాక్షర రత్నమాలా నిఘంటువు, కాలనిర్ణయము, జైమినీయ న్యాయమాలా విస్తరము, పరాశర మాధవీయము అను గ్రంథములను వ్రాసియుండును. సాయణుడు మొదట ఉదయగిరిలో రెండవ సంగమ ప్రభువునకు మంత్రియై తరువాత విజయనగరమునకు వచ్చియుండెను. వేద భాష్యముల భూమికలలో స్పష్టముగ బుక్కమహీపతికి మాధవాచార్యులవారు సాయణుడే వేదభాష్యములు వ్రాయుటకు సమర్థుడని చెప్పియున్నట్లు వర్ణింపబడినది. తదుపరి వేదభాష్యరచనను బహుశః ఇతర పండితుల సహాయముతో సాయణుడే నిర్వహించియుండెను. సాయణుడు వేదభాష్యములనేకాక ఆయుర్వేదసుధానిధి, పురుషార్థసుధానిధి, యజ్ఞతంత్ర సుధానిధి, ప్రాయశ్చిత్తసుధానిధి, అలంకార సుధానిధి, సుభాషిత సుధానిధి, మాధవీయధాతువృత్తి అను

గ్రంథములనుకూడ వ్రాసెను. సంస్కృత క్రియా స్వరూపనిరూణమును మాధవీయధాతువృత్తి సమగ్రముగ చేసియున్నది. పాణినీయ ధాతుపాఠముపై వచ్చిన వ్యాఖ్య లన్నిటిలోనిది మిన్నయైనది. అలంకారసుధానిధిని సాయణుడు ఉదయగిరిలో రెండవ సంగమ ప్రభువునకు మంత్రిగ నుండగనే వ్రాసెను. ఇందు మహిమభట్టుయొక్క అనుమతి వాదమును ఖండించి ఆనందవర్ధనుని ధ్వని వాదము ప్రతిష్ఠాపితమైనది. కవియొక్క ఔన్నత్యమును చూపుటకు శ్రుతివాక్యమును ప్రామాణీకరించినాడు. విశ్వేశ్వరుని చమత్కార చంద్రికను రెండు పర్యాయములు పరామర్శించినాడు. ఇందు ఉదాహరింపబడిన కావ్యములలో భోగనాథుని ఉదాహరణమాల మున్నగు కావ్యములును, గోపాలస్వామి అనెడి ఒక ప్రాకృత కవి రచించిన విషమబాణలీలయు పేర్కొనదగి యున్నవి. ఇందలి లక్ష్య శ్లోకములలో సాయణుని వర్ణనములే యుండుట గమనింపదగి యున్నది. ఈ అలంకారసుధానిధిని కుమారస్వామియు, అప్పయ్యదీక్షితులును పరామర్శించి యున్నారు. పురుషార్థ సుధానిధిలో పురాణేతిహాసముల లోని గాథలును చతుర్విధ పురుషార్థములకు సంబంధించిన నీతిశ్లోకములును సంకలితములైనవి. సుభాషితసుధానిధియందు ఎనుబదినాలుగు పద్ధతులలో సంస్కృత సాహిత్యములోని నీతిశ్లోకములు సంగ్రహింపబడినవి. రాజపద్ధతిలో తిక్క భూపతి, దేవనప్రభువు, కంపన మున్నగు రాజులును పేర్కొనబడియున్నారు.

కనిష్ఠ సోదరుడైన భోగనాథుని సాయణుడే మహాకవి యని పొగడి యున్నాడు. ఈతని కృతులు అలంకార సుధానిధిలో పేర్కొన బడినవి. రామోల్లాసము, త్రిపురవిజయము, మహాగణపతి స్తవము, ఉదాహరణమాల, శృంగారమంజరి అను కావ్యములనేకాక ఈతడు రెండవ సంగమనృపాలుని బిట్రగుంట శాసనమునుకూడ వ్రాసియుండెను. ఉదాహరణమాలలో సాయణుని పరాక్రమము నితడిటుల వర్ణించినాడు.

సమరే సపత్నసైన్యం సాయన తవ బింబితం వహన్ ఖడ్గః।
క్రీడతి కైటభరిపురివ బిభ్రత్క్రోడే జగత్త్రియం జలధౌ ॥

సాయణుని తనయుడైన మాధవుడు సర్వదర్శన సంగ్రహకర్త. ఇందు ఆస్తిక నాస్తిక దర్శనముల సారభూతములైన సిద్ధాంతములు చక్కగ ప్రతిపాదింపబడినవి. చౌండ పండితుని కుమారుడైన మాధవమంత్రి సూతసంహితకు

తాత్పర్యదీపిక యను వ్యాఖ్యానమును రచించెను. ఇతడు ఉపనిషన్మార్గప్రవర్తకుడని పేరుగాంచి యుండెను. ఇతడు సమస్త శైవాగమ సారసంగ్రహ మను మరియొక గ్రంథమునుకూడ వ్రాసియుండును.

అహోబలకవి విరూపాక్ష వసంతోత్సవ చంపువును వ్రాసెను. ఇందు విరూపాక్ష దేవుని రథయాత్ర వర్ణితము. ఈ రథయాత్రలో హరిహర మహారాజు, విద్యారణ్యులు గూడ పాల్గొనియుండిరి. హాస్యస్ఫోరకములైన పిట్ట కథలతో ఈ చంపూకావ్యము మిక్కిలి హృదయంగమముగా నున్నది. ఇందు శివనాటకము, శివాష్టపదియను కావ్యములును, హరకథా కాలక్షేపమును ప్రస్తావింపబడినవి.

నరహరి పండితుడు విద్యారణ్యుని దీవనలనంది నైషధీయ చరితమునకు దీపికా వ్యాఖ్యను వ్రాసెను. మరియొక నరహరియు ఈ కాలముననే కావ్యప్రకాశకు టీకను కూడ వ్రాసెను. భాస్కరకవి ఉన్మత్తరాఘవ మను ప్రేక్షణకమును విద్యారణ్యుని గౌరవార్థమై చేసిన సభలో ప్రయోగించుటకై వ్రాసియుండెను. ఇందు శ్రీరాముడు, దూర్వాసమహర్షి శాపవశమున, సీతావియోగమును పొందుటయు, విరహవర్ణనము పునస్సమాగమమునూ విక్రమోర్వశీయములోని వర్ణనముల ననుకరించుచు వ్రాసియున్నాడు.

మొదటి బుక్కరాయల కుమారుడగు కంపన ప్రభువుయొక్క పట్టపురాణి గంగాదేవి. ఈమె తన భర్త దిగ్విజయయాత్రను వర్ణించుచు మధురా విజయమను మహాకావ్యమును రచించెను. దీనికి వీరకంపరాయ చరితమనెడి నామాంతరము కలదు. ఈ కావ్యము నాటి చరిత్రవిషయములను ప్రమాణీకరించుటయే కాక అగస్త్యుడు, విశ్వనాథుడు, తిక్కన సోమయాజి మున్నగు సంస్కృతాంధ్ర కవులను కూడ కీర్తించుచున్నది. ఈ మహాకావ్యము తొండైమండలమున తురుష్కులు చేసిన అత్యాచారముల నతికరుణముగ వర్ణించుచున్నది.

> శ్రుతి రస్తమితా నయః ప్రలీనో, విరతా ధర్మకథా చ్యుతం చరిత్రమ్
> సుకృత గత మాభిజాత్య మస్తం, కిమివాన్యత్ కలిరేక ఏవ ధన్యః॥

సంస్కృతమున వ్రాసిన దాక్షిణాత్య చరిత్ర కావ్యములలో నిది కడుంగడు ప్రసిద్ధము.

మొదటి బుక్కరాయలు, రెండవ హరిహరరాయల మంత్రిగ నుండిన ఇరుగప దండనాథుడు నానార్థ రత్నమాల యను నిఘంటువును వ్రాసెను. ఈ నిఘంటు కర్త భాస్కర పండితుడనియు వ్రాత ప్రతులలో కనవచ్చుచున్నది. ఏకాక్షర, ద్వ్యక్షరాది నామధేయములతో ఇందారు కాండములు కలవు. దీనిలో దక్షిణ దేశములో వాడుకలోనున్న సంస్కృత పదములు ఆయా విశిష్టార్థము లతో కూర్చబడియున్నవి.

రెండవ హరిహరరాయల కుమారుడైన విరూపాక్షుడు ఉన్మత్త రాఘవము, నారాయణీ విలాసము అను రెండు రూపకములను రచించెను. ఈ ఉన్మత్త రాఘవమునుకూడ ప్రేక్షణమనియే కవి వర్ణించి యున్నాడు. రావణుడు సీతనపహరించుట, లక్ష్మణుడే సుగ్రీవుని సహాయముతో రావణవధ కావించి సీతను తెచ్చుట ఇందలి ఇతివృత్తము. ఈ గ్రంథముపై భాస్కరుని ఉన్మత్త రాఘవముతో పోల్చదగియున్నది. నారాయణి విలాస నాటకమున శ్రీమన్నారాయణుడు మోహినీ రూపమును దాల్చిన కథను వర్ణించినాడు. కవిత్వ మతి మధురముగా ఉన్నది. ఒకచో మోహిని నిటుల వర్ణించును.

ముక్తామయం వహన్తీ కందుక మాభాతి కాతరాక్షీయమ్
బందీకృత మివ చంద్రం కరారవిన్దేన వదన చంద్రజితమ్॥

సుప్రసిద్ధ వ్యాఖ్యాతయగు మల్లినాథపండితుడీ కాలముననే ఆంధ్రదేశమున విరాజిల్లియుండెను. ఇతడు కోలాచల వంశమునకు చెందినవాడై మహా మహోపాధ్యాయ బిరుదాంకితుడై యుండెను. ప్రతాపరుద్రీయ వ్యాఖ్యానమును వ్రాసిన కుమారస్వామియు, పెద్దయార్యుడును ఇతని కుమారులు. ఇతని వంశమున పెక్కు తరములలో మహాపండితు లుద్భవించి యుండిరి. ఈతని తాతయు మల్లినాథుడే. అతడు కాకతీయ ప్రతాపరుద్రుని సమకాలీనుడై యుండవచ్చును. తండ్రియగు కపర్ధి పండితుడు గొప్ప ధర్మశాస్త్రవేత్త; కపర్ది కారికలనెడి సుప్రసిద్ధ శ్రౌత గ్రంథ మీయనదే.

మల్లినాథుడు న్యాయవైశేషిక శాస్త్రములందును వేదాంతమునను మహా పండితుడు. తదితరములగు అనేక విద్యలను కూడ అతడు సంపూర్ణముగ ఆకలించుకొని యుండెను. ఆయా శాస్త్రములలోని ఉత్తమ గ్రంథములు ఆతనికి కరతలామలకములని ఆతని వ్యాఖ్యానములను చదివిన వారందరకు విది

తమే. మల్లినాథుడు రఘువీర చరిత మహాకావ్యమును రచించెననియు అందురు. రెండవ దేవరాయల కాలమున వైశ్యులకు గల వాణిజ్యాధికారమును గూర్చిన వివాద మొకటి ఏర్పడగా దానిని పరిష్కరించుటకై కొందరు ధర్మాధికారుల నా మహారాజు నియమించియుండెను. ఆ ధర్మాధికారుల కధ్యక్షుడు మల్లినాథుడు. వారు వ్రాసిన ధర్మశాసనము వైశ్యవంశ సుధాకరమను పేర మనకు లభ్యమగు చున్నది ఇందు ధర్మ సూక్ష్మము లెన్నియో చర్చింపబడినవి.

మల్లినాథుడు కాళిదాసుని మహాకావ్యములపై సంజీవనీ వ్యాఖ్యను, కిరాతార్జునీయముపై ఘంటాపథ వ్యాఖ్యను, శిశుపాలవధ మహాకావ్యముపై సర్వంకషా వ్యాఖ్యను, నైషధీయ చరితముపై జీవాతు వ్యాఖ్యను, భట్టికావ్యముపై సర్వపథీనావ్యాఖ్యను వ్రాసెను. ఇవికాక కళింగ దేశస్థుడైన విద్యాధరుని ఏకావళి యను అలంకార శాస్త్ర గ్రంథముపై తరళమనెడి వ్యాఖ్యానమును కూడ వ్రాసెను. ఇక శాస్త్ర వ్యాఖ్యానములలో వరదరాజ కృతమైన తార్కికరక్షపై వ్రాసిన నిష్కంటకా వ్యాఖ్యయు, ప్రశస్తపాదభాష్యటీకయు, స్వరమంజరీ పరిమళమును ఇతని గ్రంథములుగనే ప్రసిద్ధి చెందియున్నవి.

మల్లినాథుని వ్యాఖ్యానములు క్లుప్తముగను స్పష్టముగను, సరళముగను, ఉండి చదువరులకు మిక్కిలి ఉపయోగకరములై యున్నవి. తన వ్యాఖ్యా పద్ధతిని స్వయముగా ఇటుల ప్రతిపాదించియున్నాడు.

ఇహాన్వయ ముఖేనైవ సర్వం వ్యాఖ్యాయతే మయా
నామూలం లిఖ్యతే కించిత్ నానపేక్షిత ముచ్యతే.

ఈపద్ధతి తిమ్మరుసు మున్నగు వ్యాఖ్యాతలకు మేలుబంతి యైనది. మహా కావ్య వ్యాఖ్యానములలో నితడు సరియగు పాఠములకు విశేష స్థానమొసగి ప్రక్షిప్తములను పరిహరించి యున్నాడు. దక్షిణావర్తనాథుడు మున్నగు పూర్వ వ్యాఖ్యాతల వ్యాఖ్యానములను సయుక్తికముగా విమర్శించియున్నాడు. అనేక శాస్త్ర గ్రంథములను నిఘంటువులను ప్రమాణములుగా ఉదాహరించియున్నాడు. ఇతని పాండిత్యము, గ్రంథపరిచయము అనన్య సామాన్యములు. ముద్రిత గ్రంథములులేని ఆ కాలమున అట్టి సర్వతోముఖ విజ్ఞానమును పొంది యుండుట మిక్కిలి ఆశ్చర్యజనకముగా ఉన్నది. ఏకావళిపై వ్రాసిన తరళయు ఇతర శాస్త్ర వ్యాఖ్యానములును ఇతని శాస్త్ర పాండిత్య పటిమకు నిదర్శనములు.

ఇతర వ్యాఖ్యానములలో నితడు ప్రతాపరుద్రీయము, రసార్ణవ సుధాకరము, వసంత రాజీయము మున్నగు సమకాలీనులైన ఆంధ్ర కవి పండితుల గ్రంథములను కూడ ఉద్ధరించి యుండుట గమనింపదగియున్నది.

ఇతని కుమారుడైన పెద్దిభట్టుకూడ శాస్త్ర వ్యాఖ్యానముల నిబంధించి నట్లు కుమారస్వామి సోమపీథి చెప్పియున్నాడు. కుమారస్వామి వ్రాసిన ప్రతాపరుద్రీయ వ్యాఖ్యానమైన రత్నాపణము మనకుపరిచితమే. అర్వాచీన కాలమున కృష్ణ కర్ణామృత వ్యాఖ్య వ్రాసిన పాప యల్లయసూరి మహాకావ్య వ్యాఖ్యత పెద్దిభట్టేయని సూచించియున్నాడు. ఇంకను ఎన్నియో కథలు పెద్దిభట్టును గూర్చియు, మల్లినాథుని గూర్చియు దక్షిణ దేశమున ప్రచారములో ఉన్నవి కాని వీని కాధారము లెవ్వియు మనకు కానరావు మల్లినాథునకు గిరినాథుడను మరియొక కుమారుడు కూడ నుండెననియు ఆతడే స్వరమంజరీ పరిమళమును వ్రాసెననియు, ఆ గిరినాథునకే పెద్దిభట్టను నామాంతరముకూడ నుండెననియు కొందరు చెప్పుదురు.

మల్లినాథున కారవతరము వాడైన కొండుభట్టు వేదపండితుడును, కవియునై యుండెను. ఇతని మనుమడైన నారాయణ పండితుడు భోజుని రామాయణ చంపువుపై పదయోజన యను వ్యాఖ్యను వ్రాసెను. అందు పెద్దిభట్టునకు సర్వజ్ఞుడను రాజు కనకాభిషేకము చేసినట్లు వర్ణింపబడినది. ఈ సర్వజ్ఞుడు రాచకొండనేలిన సర్వజ్ఞ సింగభూపాలుడే అని అందురు.

కవి రాక్షసీయ మను సుప్రసిద్ధ శ్లేషకావ్య మొకటి మనకు లభ్యమగుచున్నది. దీనిని వ్రాసిన కవి సాక్షరుడగుటచే లోకము ఈర్ష్యతో నాతనిని రాక్షసుడని పిలువదొడగినదని కవియే చెప్పుకొనియున్నాడు.

సాక్షరేషు భవతీహ జగత్యాం సర్వఏవహృది మత్సరయుక్తః
సాక్షరం కవిజనేషు యదేనం లోక ఏష కవిరాక్షస మాహ॥

సంస్కృత సాహిత్య చరిత్రలో నెందరో కవిరాక్షసులు కలరు. పై శ్లేషయుక్తమైన సుభాషితముల వ్రాసిన కవిరాక్షసుడు, జన్నయకవి తన దేవకీనందన శతకమున పేర్కొనినవాడే అని పండితుల అభిప్రాయము. ఇతడు మొదటి దేవరాయల కాలమున నుండి యుండును. ఈ కవిరాక్షసీయమునకు సూక్తి సంగ్రహ మను నామాంతరమునూ కలదు. రేవణాచార్యుని తనయుడైన నాగ

నార్యుడును, తిరువిశలూరు నివాసియైన శ్వేతవన స్వామియు దీనికి వ్యాఖ్యానములు వ్రాసిరి. మొదటి వ్యాఖ్యను శ్లిష్టార్థ దీపిక అందురు. ప్రసిద్ధమగు

గుణ దోషౌ బుధో గృహ్ణన్ ఇందుక్ష్వేడా వివేశ్వరః।

శిరసా శ్లాఘతే పూర్వం పరం కంఠే నియచ్ఛతి॥ అను శ్లోకమిందు కానవచ్చుచున్నది.

రెండవ దేవరాయల బావగారైన సాళువ గోప తిప్ప భూపాలుడు మార్గదేశీ తాళ లక్షణములను వర్ణించుచు "తాళదీపిక"ను వ్రాసెను. ఇతడు భరతమత పారావార పారీణుడను పేరు బడసియుండెను. దీనిపై సంగీత దీపిక యను తెలుగు వివరణముకూడ తంజావూరు గ్రంథాలయమున ఉన్నది. ఇతడు వామనుని కావ్యాలంకార వృత్తిపై కామధేను వ్యాఖ్యను వ్రాసెను. వామనుని గ్రంథముపైగల వ్యాఖ్యలన్నిటిలో నిది శ్రేష్ఠమైనది. ఇతడింకొక నాట్య లక్షణ గ్రంథమును కూడ వ్రాసెనందురు.

చతుర కల్లినాథుడు శార్ఙ్గదేవుని సంగీత రత్నాకరముపై కళానిధి యను వ్యాఖ్యానమును వ్రాసెను. ఇతడు ఇమ్మడి దేవరాయల కాలమున నుండెను. ఉపోద్ఘాతములో నిందు విజయనగర రాజుల వర్ణనకూడ ఉన్నది. ఈ వ్యాఖ్యానములో తోడరుమల్లు మున్నగు సంగీత విద్వాంసులు పేర్కొనబడి యున్నారు. ఈ వ్యాఖ్యాన మతి ప్రౌఢమును ప్రామాణికమునై యున్నది.

చోళుల కాలములో వంగదేశమునుండి తరలివచ్చి దక్షిణమున తిరువన్నామలై సమీపముననున్న ముల్లాంద్రం అనుచోట నివాసమేర్పరచుకొని విజయనగరరాజుల యాదరమునకు విశేషముగ పాత్రమైన పండిత కుటుంబము డిండిమకవులను పేర ప్రసిద్ధి నొందినది. ఈవంశమునకు చెందిన రాజనాథకవి బల్లాలుని యాస్థానకవుల నోడించి కవిప్రభువను బిరుదమును పొందెను. మొదటి అరుణగిరినాథుడు ఎనిమిది భాషలలో పండితుడై దర్శనాభిజ్ఞుడును, శైవ సిద్ధాంతవేత్తయునై యుండెను. అతనికి అభినవ నాటక భవభూతి యనియు, డిండిమకవి సార్వభౌముడనియుకూడ బిరుదము లుండెను. ఇతడు వ్రాసిన మహానాటక సూక్తి సుధానిధిని రెండవ దేవరాయలే వ్రాసెనని యు అనుచున్నారు. ఇతని రామాభ్యుదయ మహాకావ్యము సాళువ నరసింహ కృతమనికూడ చెప్పబడుచున్నది. సోమవల్లీ యోగానంద ప్రహసనమునుకూడ

ఇతడు వ్రాసెను. ఇందులో ఈ కవి యోగానందుడను సన్యాసియొక్కయు, రాజపురోహితుని కూతురైన సోమపల్లి యొక్కయు ప్రణయమును హాస్యస్ఫోరకముగా వర్ణించియున్నాడు.

పై అరుణగిరినాథుని తనయుడైన రాజనాథుడు సాళువ నరసింహుని ఆస్థానముననుండి సాళవాభ్యుదయమనెడి చరిత్రకావ్యమును వ్రాసెను. ఇతని కుమారుడైన అరుణగిరినాథుడు వీరభద్రవిజయ మనెడి డిమమున దక్షయజ్ఞ కథను వర్ణించెను. ఇతనికి కుమారడిండిమాది బిరుదము లున్నవి. ఈతని కుమారుడైన రాజనాథుడు అచ్యుతరాయాభ్యుదయమను మహాకావ్యమును, భాగవతచంపువును వ్రాసెను, ఈ అచ్యుతరాయాభ్యుదయము ఆనాటి విషయముల తెలిసికొనుటకు మిక్కిలి ఉపయోగపడుచున్నదని చరిత్రకారులు చెప్పుచున్నారు ఈ కవి భాగవత చంపువును అచ్యుతరాయల యానతిపై వ్రాసియుండెను.

ఆంధ్రభోజుడని పేరుగాంచిన శ్రీ కృష్ణదేవరాయలు సంస్కృతాంధ్రముల యభివృద్ధికి మిక్కిలి తోడ్పడియుండెను. ఇతడు స్వయముగ సంస్కృతాంధ్రములలో కావ్యములు నిర్మించియుండెను. ఆముక్తమాల్యదలో తాను మదాలస చరిత్ర, సత్యావధూ ప్రీణనము, సకలకథా సారసంగ్రహము, జ్ఞాన చింతామణి, రసమంజరి యను సంస్కృత కృతులను వ్రాసియుండినట్లు చెప్పుకొని యున్నాడు. తన గురువగు వ్యాసతీర్థుల యానతిపై పౌరాణిక గాథలను కూర్చి సకల కథాసార సంగ్రహమును వ్రాసెను. ఉషాపరిణయ మను ఒక రూపకమునుకూడ ఇతడు వ్రాసినట్టు చెప్పుదురు. పైవానిలో రసమంజరి మున్నగు కొన్ని గ్రంథములను అల్లసాని పెద్దన్నయే వ్రాసెనని కొందరి అభిప్రాయము. జాంబవతీకల్యాణ మను నొక ఐదంకముల నాటకమునుకూడ ఇతడు వ్రాసియుండెను. ఇందు శ్యమంతమణి కథను వర్ణించినాడు. ఈ నాటకము అభిజ్ఞాన శాకుంతల ఛాయలను కలిగియున్నది. ఇందొకచో జాంబవతి నిట్లు వర్ణించినాడు.

ఆలక్ష్య చారు కుచ కుట్మల సన్నివేశ
మారోపితో నిటలమంజలిరాయతాక్ష్యాః।
లావణ్యశాలి వదనద్యుతి వారి పూర-
సంజాయమాన సరసీరుహ కోరకశ్రీః॥

శ్రీ కృష్ణదేవరాయల రాణియు, కళింగాధిపతియైన ప్రతాపరుద్ర గజపతి కుమార్తెయునగు తుక్కాదేవి భర్తయొక్క అనురాగమును పొందలేక తీవ్ర విరహముతో తుక్కాపంచకమను మనోహర శ్లోకముల వ్రాసెనని చెప్పుదురు. అందు విప్రలంభ శృంగారము చాల బాగుగ వర్ణింపబడినది.

చరన్ వనాన్తే నవమంజరీషు
నషట్పదో గంధఫలీమ జిఘ్రత్
సాకిం న రమ్యా స చ కిం న రన్తా
బలీయసీ కేవల మీశ్వరరాజ్ఞా.

శ్రీ కృష్ణదేవరాయల మంత్రియైన తిమ్మరుసు అగస్త్యుని బాల భారతముపై మనోహర నామక వ్యాఖ్యానమును వ్రాసినట్లు చెప్పియున్నాము రాయల యాస్థానములోనున్న సుప్రసిద్ధ సంగీత విద్వాంసుడు బండారు లక్ష్మినారాయణ. ఇతడు సంగీత సూర్యోదయమను లక్షణ గ్రంథమును వ్రాసెను.

శ్రీ కృష్ణదేవరాయల యాస్థానమున లొల్ల లక్ష్మీధరుడనునొక మహాపండితుడుండెను. ఇతడు రాయల కొండవీటి శాసనమును కూడ సంస్కృతమున వ్రాసియుండెను. ప్రతాపరుద్ర గజపతి యాస్థానమునుండి ఇతడు విజయ నగరమునకు తరలి వచ్చెను. ఈయన శ్రీ శంకరుని సౌందర్యలహరిపై గొప్ప వ్యాఖ్యానమును వ్రాసెను. ఈ వ్యాఖ్యానములో నాతని వంశము వారు కొన్ని తరముల నుండి సుప్రసిద్ధ పండితులై యనేక గ్రంథములను నిబంధించి యున్నట్లు వర్ణించినాడు. ఇతడు కళింగదేశమున నున్నపుడు సరస్వతీవిలాస మను ధర్మశాస్త్ర గ్రంథమును వ్రాసెను. లక్ష్మీధరమనునది ఈతని సాహిత్య గ్రంథము. కర్ణావతంసము, బర్హావతంసము అను కావ్యములు న్యాయ వివేకము, యోగదీపిక, మహా బంధనము అను శాస్త్ర గ్రంథములపై వ్యాఖ్యలు ఇతని ఇతర గ్రంథములు. ఇంద్ర తంత్ర వేత్తయై లొల్ల సంప్రదాయమునకు చెందియుండెను.

కొండపల్లి నివాసియైన కంచం యల్లయార్యుడు జ్యోతిశ్శాస్త్రమునను, ధర్మ శాస్త్రమునను ప్రవీణుడు. ఇతడు లొల్ల లక్ష్మీధరునితో కలసి దైవజ్ఞ విలాసమనెడి జ్యోతిష గ్రంథమును వ్రాసెను. కాత్యాయన ప్రయోగసరణి, స్మృతి కదంబకము, గణక దర్పణము, జ్యోతిష దర్పణము ఈతని కృతులు.

శ్రీధర పండితుని కుమారుడైన మల్లయ సూర్య సిద్ధాంత వ్యాఖ్య, లఘుమానస వ్యాఖ్యలను వ్రాసెను. ఈ కాలముననే కృష్ణా తీరవాసియైన ఈశ్వర దీక్షితుడు శ్రీమద్రామాయణముపై బృహద్వివరణము, లఘువివరణము అను పేర రెండు వ్యాఖ్యానములను వ్రాసియుండెను. వీరేకాక మరియు నెందరో సంస్కృత కవి పండితులీ కాలమున విజయనగర రాజుల పోషణమున ఉండిరి. సుప్రసిద్ధ వైష్ణవమతాచార్యులైన వల్లభాచార్యులు విజయ నగరాస్థానమును సందర్శించి యున్నట్లు చెప్పుదురు. వ్యాసతీర్థులు సుప్రసిద్ధ మాధ్వ వేదాంతి. ఇతడు విజయనగర రాజులయొద్దనుండి ఎన్నియో న్యాయ వేదాంత గ్రంథములను విరచించినాడు.

శ్రీ కృష్ణదేవరాయల తరువాత రాజ్యమేలిన అచ్యుతరాయలు కూడ కవి పండిత పోషకుడై యుండెను. సోమనాథుడను పండితుడును అచ్యుత రాయలును తాళమహోదధి యను గ్రంథమును వ్రాసిరందురు. తిరుమలాంబ యను విదుషీమణియు నీయన యాదరము బడసి అచ్యుతరాయల యొక్కయు ఇతని రాణియైన వరదాంబిక యొక్కయు వివాహమును వర్ణించుచు వరదాం బికాపరిణయ మను చంపూప్రబంధమును వ్రాసెను. రామామాత్యుడను సంగీత జ్ఞుడు స్వరమేళ కలానిధి యను లక్షణ గ్రంథమును వ్రాసెను.

తిరుమల రాయల యాస్థానమున చెరుకూరు లక్ష్మీధరుడను నొక పండితుడుండెను. ఇతడు పూర్వోత్తర మీమాంసలయందు దిట్ట. ఈయన అనర్ఘరాఘవమునకు, ప్రసన్న రాఘవమునకు, గీతగోవిందమునకు వ్యాఖ్యాన ములు వ్రాసెను. ఇతని ప్రసన్న రాఘవవ్యాఖ్య తిమ్మభూపాలీయమని ప్రసిద్ధి గాంచినది. షడ్భాషాచంద్రిక యనెడి ప్రాకృత వ్యాకరణముకూడ ఈయనదే. ఇతని వంశములోని వాడేయైన యజ్ఞనారాయణ పండితుడు పూర్వ మీమాంసా వేత్తయై శాస్త్ర దీపికకు ప్రభామండలమను వ్యాఖ్యానమును వ్రాసెను. అలం కార సూర్యోదయముకూడ యీతని కృతులే. అలంకార రాఘవమున ఉదా హరణ శ్లోకములన్నియు శ్రీరాముని గుణములను కీర్తించుచున్నవి. యజ్ఞ నారాయణుని కుమారుడైన వెంకటేశుడు చిత్రబంధ రామాయణమను చిత్ర కావ్యమును వ్రాసెను. దీనిపై ఈతని తండ్రియైన యజ్ఞనారాయణుడే వ్యాఖ్యా నమును వ్రాసియున్నాడు. రాయసం అహోబలమంత్రి కువలయ విలాస నాటకమును వ్రాసెను. ఇందు మదాలస కువలయాశ్వుల కథ వర్ణింపబడినది.

# నాయకరాజులు - ప్రవాసాంధ్రులు

విజయనగర సామ్రాజ్యము విచ్ఛిన్నమైన తరువాత దక్షిణ దేశమున తంజావూరు మున్నగు ప్రాంతములలోని సామంత నాయకులు స్వతంత్రులైరి. వీరు తెలుగు వారగుటచేత ఆంధ్రకవి పండితులెందరో వీరి ప్రాపున చేరిరి. కావ్యములును శాస్త్ర గ్రంథములును ఎన్నియో నిబంధింపబడెను. ఈ నాయక రాజులలో కొందరు సంస్కృతమున గ్రంథములను కూడ వ్రాసియుండిరి.

తంజావూరు నాయకరాజుల యాస్థానమున గోవింద దీక్షితులు మున్నగు మహాపండితులుండిరి. వీరు వేదశాస్త్రాభిజ్ఞులై సంగీత సాహిత్యము లందును ప్రావీణ్యము కలిగి యుండిరి. గోవింద దీక్షితుడు సంగీత సుధయను గ్రంథమును స్వయంగా వ్రాసి రఘునాథరాయల కంకిత మొనర్చెను ఈతని కుమారుడు యజ్ఞనారాయణ దీక్షితుడు. ఇతడు రఘునాథ భూప విజయము రఘునాథ విలాసము, అలంకార రత్నాకరమను గ్రంథముల వ్రాసెను. వీటి యన్నింటిలోను రఘునాథ భూపాలుని వివిధముగా పొగడి యున్నాడు. ఇతని సోదరుడైన వేంకటేశ్వర దీక్షితుడు పెక్కు మీమాంసా గ్రంథములను వ్రాయుటయే కాక శుల్బమీమాంస యను వేద గణితమును చతుర్దండి ప్రకాశికయను కర్ణాటక సంగీత లక్షణమును కూడా వ్రాసెను. రఘునాథుని యాస్థానములోనున్న కృష్ణ దీక్షితుడు రఘునాథ భూపాలీయమను అలంకార గ్రంథమును వ్రాసెను. రఘునాథ భూపాలుని మతగురువైన కుమార తాతాచార్యులవారు పారిజాత నాటకాది గ్రంథముల నెన్నిటినో వ్రాసి రాజాంకిత మొనర్చినాడు. ఇతని ఆస్థానముననే యున్న భాస్కర దీక్షితుడను వేదాంతి ''ఆత్మతత్త్వ పరీక్ష''ను వ్రాసెను. పై పండితులలో కొందరు కర్ణాటకాది దేశీయులయ్యు తెలుగు నాయకుల ప్రాపున చేరి సంస్కృత సాహితీ మతల్లికకు విశిష్ట సేవను చేసియుండిరి.

రఘునాథ భూపాలుడుకూడ సంస్కృతమున గ్రంథ రచన యొనర్చి యుండెను. నిజమున కెన్నియో గ్రంథములు ఈతని ఆస్థాన పండితులే వ్రాసి యుండిరి. కాని అవి ఈతని కర్తృత్వమునను ప్రచారములోనికి వచ్చినవి. భారత సంగ్రహము, రామాయణ సంగ్రహము మున్నగు కొన్నింటిని ఈయనయే వ్రాసి యుండవచ్చును.

రఘునాథుని యాస్థానమున రామభద్రాంబ మధురవాణి యను ఇద్దరు విదుషీమణులుండిరి. రామభద్రాంబ రఘునాథ భూపాలుని చరిత్రమును వర్ణించుచు రఘునాథాభ్యుదయమను మహాకావ్యమును వ్రాసెను. మధురవాణి రామాయణసార తిలకమనెడి మహాకావ్యమును వ్రాసెను. ఇందు చిత్ర కవిత్వము కూడ కలదు. రఘునాథాభ్యుదయమున రఘునాథుని విద్వత్కవి గోష్ఠులు మనోహరముగ వర్ణింపబడినవి.

నాయకరాజుల తరువాత తంజావూరునేలిన మరాఠీ ప్రభువుల కాలమునను తెలుగు పండితులెందరో అచటనుండి సంస్కృతమున గ్రంథ రచన మొనరించిరి. శహాజీపురాగ్రహార ప్రతిగ్రహీతలలో ముఖ్యుడైన శ్రీధర వేంకటేశ పండితుడు నామ సిద్ధాంత సంప్రదాయమును ప్రవర్తింపచేసియుండెను. అతడు ఆఖ్యాషష్టి, దయాశతకము మున్నగు పదునాలుగు స్తోత్రములనే కాక శాహేంద్ర విలాసమను మహాకావ్యమును కూడ వ్రాసెను. ఇతని కుమారుడు శ్రీధర పేరుభట్టు. పేరుభట్టు సంస్కృత వ్యాకరణమున మహాపండితుడై నవీన పతంజలి యని పేరుగాంచి యుండెను. ఇతడు చకోర సందేశము, వసుమంగళా నాటకము మున్నగు కావ్యముల వ్రాసెను. ఇతని ఔణాదిక పదార్ణవము సంపూర్ణముగ లభ్యమగుట లేదు. ఇది ఉణాది సూత్రములకు వ్యాఖ్యారూపమున నున్నది. నివృత్తి శేషాచలపతి ఆంధ్రపాణిని యని పేరుగాంచియుండెను. ఇతని భోసల కోసలీయమను ద్వ్యర్థికావ్యము శ్రీరాముని, శహాజీని శ్లేష పూర్వకముగ కీర్తించుచున్నది.

సుప్రసిద్ధ వేదాంతియు, శతాధిక గ్రంథకర్తయునగు అప్పయ్య దీక్షితుడు తెలుగు నాయకుల ప్రాపుననే యుండి యుండెను. మొదట చిన్న తిమ్మభూపాలుని యొద్దనుండి వేదాంత దేశికుని యాదవాభ్యుదయమునకు వ్యాఖ్యానము వ్రాసియుండెను. తరువాత వెల్లూరులో చిన బొమ్మనాయకుని ప్రాపున శివార్క మణిదీపికను వ్రాసి కనకాభిషేక సత్కారమును పొందియుండెను. పెనుకొండలో వేంకటపతి రాయల యాదరమునకు పాత్రుడై విధి రసాయనమును, కువలయానందమును వ్రాసెను. యాదవాభ్యుదయమును పోలిన హరివంశ మహాకావ్యమునకును ఈ అప్పయ్య దీక్షితుడొక వ్యాఖ్యానమును వ్రాసియుండెను. ఈ మహాకావ్యమును గోవింద మంత్రి యను నాతడు వ్రాసెను. అతడు కొండవీటివాడై యుండును. ఇటుల అప్పయ్య దీక్షితుడు తమిళ

దేశము వాడయ్యె తెలుగు నాయకుల యాదరాభిమానముల చూరగొ యుండెను. ఈతడు తెలుగుదేశము నిటుల కీర్తించెనందురు

ఆంధ్రత్వ మాంధ్ర భాషా చ
ప్రాభాకర పరిశ్రమః
తత్రాపి యాజుషీ శాఖా
నాల్పస్య తపసః ఫలమ్
సరసా స్తిలవత్ గావః, యత్ర సన్తి సహస్రశః।
స దేశ స్తెలుగుర్నామ తతోఽ సౌయజ్ఞయః స్మృతః॥

నెల్లూరునేలిన లింగయ ప్రభువు ఆస్థానములో నున్న ఆలూరి సూర నారాయణ కవి ఏకదిన ప్రబంధమును వ్రాసెను. పేరును బట్టి ఇది ఒక రోజులో వ్రాయబడియుండును. ఇందు అర్జునుని ఘోషయాత్ర, చిత్రాంగదతో వివాహము, బభ్రువాహన జననము, సుభద్రతో వివాహము వర్ణింపబడినవి.

చేంజి రాజ్యమునేలిన సూరప నాయకుని యాస్థానమున రత్నఖేట శ్రీనివాస దీక్షితుడను మహా పండితుడుండెను. అప్పదీక్షితుని పలె నీతడున భావనా పురుషోత్తమాద్యనేక గ్రంథములను విరచించెను. ఇతని తనయుడు రాజ చూడామణి దీక్షితుడు. మొదట చేంజిలోనుండి తరువాత తంజాపురమున కేగి యచట వేంకటమఖికి శిష్యుడై మహా పండితుడుగా ప్రసిద్ధిగాంచెను. కృష్ణప్పనాయకుని యాస్థాన కవియైన లక్ష్మణకవి విలాస కృష్ణుని లీలల వర్ణించుచు కృష్ణ విలాస చంపువును వ్రాసెను.

మధుర నాయకులు నీలకంఠ దీక్షితుడను పండితుని పోషింపియుండిరి. ఇతడు నీలకంఠ విజయ చంపువు మున్నగు గ్రంథముల వ్రాసెను. ఇతని సోదరుడైన అప్పయ్య దీక్షితుడు మధుర నాయకుడైన చొక్కనాథుని యాజ్ఞపై ప్రాకృత మణిదీపము మున్నగు గ్రంథముల వ్రాసెను. చిన బొమ్మ భూపాలుడు గీత గోవిందము ననుకరించుచు సంగీత రాఘవ మనెడి గీత కావ్యమును విరచించెను. వీరప్పనాయకుని మంత్రియైన రాయస వేంకటాద్రి స్మృతి కౌస్తుభ మనెడి ధర్మశాస్త్ర గ్రంథమును వ్రాసెను.

మైసూరు రాజుల యాస్థానములో నుండిన నృసింహకవి నంజరాజ యశోభూషణమను అలంకార ప్రబంధమును వ్రాసెను. ఇందు విద్యానాథుడు ప్రతాప

రుద్రుని పొగడినటుల నృసింహకవి మైసూరు ప్రభువైన నంజరాజును పొగడి యున్నాడు. ఇతడు అభినవకాళిదాస బిరుదాంకితుడై యుండెను. ఇతని మిత్రుడైన ఆలూరి తిరుమలకవి 'అభినవ భవభూతి' యని పిలువబడుచుండెను. ఇతడు చంద్రికాపరిణయ మను నాటకమును రచించెను. బాల చంద్ర శేఖర కవి శృంగార జగన్మోహిని యను మిశ్ర భాణమును వ్రాసెను.

రాజాస్థానములలోనేకాక దక్షిణదేశమున ప్రసిద్ధిగాంచిన తెలుగువారైన సంస్కృత కవిపండితులెందరో కలరు, ఇట్టివారిలో సదాశివ బ్రహ్మేంద్రయతి వైన చెప్పబడిన శహాజీపురాగ్రహారప్రతి గ్రహీతలలోనొకరు. ఈతడు బ్రహ్మ సూత్ర సంగ్రహవ్యాఖ్య, యోగసూత్రవ్యాఖ్య, ఆత్మవిద్యావిలాసము మున్నగు వేదాంత గ్రంథములనువ్రాసెను. నారాయణ తీర్థుడును తమిళదేశమునకు వలస పోయి కృష్ణలీలా తరంగిణి యను సుప్రసిద్ధ గీతకావ్యమునువ్రాసెను. హరిభక్తి సుధార్ణవ మహాకావ్యముకూడ ఇతనిదే. సుప్రసిద్ధ వాగ్గేయకారుడైన త్యాగరాజు కూడ దక్షిణదేశములో నుండియే తన కృతులను వ్రాసెను. ఇందు సంస్కృత కృతులును కొన్ని యున్నవి.

శ్రీధర వేంకటేశుని శిష్యుడైన అయ్యనకవి పూర్వోత్తర మీమాంసా శాస్త్రముల పండితుడై ప్రణవార్థప్రకాశ, యజ్ఞశాస్త్రార్థ నిర్ణయము మున్నగు గ్రంథములను వ్రాసెను. శ్రీధర గురుమూర్తి పండితుడు శివతత్త్వసార సంగ్రహ చరిత్రను వ్రాసెను. నెల్లూరు వీరరాఘవకవివ్రాసిన ఇందిరా పరిణయ నాటకములో తెలుగు ముత్తైదువుల మంగళ హారతి పాటలు ప్రశంసింప బడినవి. ఈ విధముగ ఆ కాలమున దక్షిణదేశమునకు వలసపోయిన తెలుగుసామంతులు, కవిపండితులుకూడ ఆయా ప్రాంతముల నుండియే సంస్కృత సాహిత్యమునకు మిక్కిలి సేవ చేసి యుండిరి.

ఈ సందర్భమున సుప్రసిద్ధమగు సంస్కృత విద్యాకేంద్రమైన కాశీలో తెలుగు పండితు లెందరోచేరి అచట సంస్కృత గ్రంథరచనను సాగించి యుండిరి. వారిలో పేరెన్నిక గన్న కొందరినైనను మనమిచట ప్రస్తావించ వలసి యున్నది. జగన్నాథ పండితుడు షాజహాను కాలమున మొగలు దర్బారులోను తదితరులైన ఉత్తరదేశరాజుల చేతను సత్కరింపబడి అనేక గ్రంథముల వ్రాసెను. ఇతని రసగంగాధరము సుప్రసిద్ధాలంకార గ్రంథములలో కడపటిది. ఇందు నవ్యన్యాయ పద్ధతిని అలంకారశాస్త్ర విషయములెన్నియో పరి

ష్కరింప బడినవి. అప్పయ్యదీక్షితుని చిత్రమీమాంసలోని సిద్ధాంతములనిందు తీవ్రముగ విమర్శించినాడు. ఈయన వ్యాకరణమున భట్టోజిదీక్షితునకు ప్రతి స్పర్థిగా నుండెను. భామినీవిలాసముప శృంగార రసభరితములైన చాటుపు లెన్నియో కలవు. ఇతడు కరుణాలహరి, గంగాలహరి, జగదాభరణము మున్నగు కావ్యములను కూడ వ్రాసెను, ఇతని కవిత్వము సలక్షణమును, సహృదయ హృదయంగమమునై విరాజిల్లుచున్నది. ఇతని పంచలహరులు భక్తి భావమును మనోహరముగ వర్ణించుచున్నవి, కరుణా లహరిలో

అయి గర్తముఖే గతః శిశుః
పథికేనాపి నివార్యతే జవాత్
జనకేన పతన్ భవార్ణవే
న నివార్యో భవతా కథం విభో॥

తన కరుణా విలాసమున ప్రేయసీ వియోగము నిటుల పరిదేవించుచున్నాడు.

కావ్యాత్మనా మనసి పర్యమణన్ పురా మే
పీయూషసార సరసాస్తవయే విలాసాః
తా నంతరేణ రమణీ రమణీయ శీలే
చేతోహరా సుకవితా భవితా కథంనః॥
స్వప్నాంత రేఽపి ఖలు భామిని పత్యురన్యం
యా దృష్టవత్యసి నకంచన సాభిలాషమ్,
సా సంప్రతి ప్రచలితాసి గుణైర్విహీనం
పాప్తుం కథం కథయ హన్త పరం పుమాంసమ్ ॥

సుప్రసిద్ధ వ్యాకరణ పండితులైన శేష వీరేశ్వరుడు, శేష కృష్ణుడను వారు కూడ తెలుగువారేనని కొందరి అభిప్రాయము. పదవాక్య ప్రమాణజ్ఞుడైన అన్నంభట్టు కూడ కాశీలోనే యుండి తన శాస్త్రగ్రంథములను వ్రాసెనందురు. ఇతడు తర్క సంగ్రహమునేకాక మితాక్షర యను సమాన నామధేయముకల బ్రహ్మసూత్ర భాష్యమును, మహాభాష్య వివరణమును కూడ వ్రాసెను వారణాశి ధర్మసూరి సాహిత్య రత్నాకర మను నలంకార గ్రంథమును, నరకాసుర వ్యాయోగమునేకాక సన్న్యసించిన పిమ్మట రామానంద నామధేయముతో శంకరుని సూత్ర భాష్యముపై రత్నప్రభ యను టీకను వ్రాసెను ఇంకను ఎందరో త్రిలింగ దేశ పండితులు ఉత్తర దేశరాజుల కొలువులలోనుండి సంస్కృతమున గ్రంథ రచనము సాగించియుండిరి.

# సంస్థానములు

తెలుగు దేశములో విజయనగర సామ్రాజ్యమంతరించిన తరువాత ఎన్నియో చిన్న చిన్న సంస్థానములు నెలకొనినవి. ఈ సంస్థాన ప్రభువులు సంస్కృత పండితులను కవులను పోషించుచు వచ్చిరి. సంస్కృత విద్యా భ్యాసమునకు నెంతగనో దోహదము చేసియుండిరి. వీరి ఏలికలోను సంస్కృత సాహిత్యము ఎక్కువగ అభివృద్ధి చెందినది.

విశాఖపట్టణము జిల్లాలోని విజయనగర సంస్థానమును పూసపాటి క్షత్రియ వంశీయు లేలిరి. చిన విజయరామ గజపతి కాలమున నడిమింటి సర్వ మంగళేశ్వర శాస్త్రియను పండితుడుండెను. ఈయన సమాస కుసుమావళి, విభక్తి విలాసము, సర్వమంగళీయమను వ్యాకరణ గ్రంథములను వ్రాసెను. విభక్తి విలాసమున లక్షశ్లోకములలో విజయరామ గజపతిని కీర్తించి యున్నాడు, సునీతి సన్నుతీయ మను తర్కగ్రంథమును, భగవద్గీతా భాష్య మునుకూడ ఈతడు వ్రాసియుండెను. ఇతనికుమారుడైన పతంజలిశాస్త్రి యోగ శాస్త్రమున ప్రవీణుడై కాశీనగరమున నేపాలుమహారాజున కుపదేశ మొసంగి యుండెను. తరువాత ఇతడు నేపాలులో సంస్కృత విద్యావ్యాప్తికి మిక్కిలి తోడ్పడియుండెను. ఇతని కుమారుడైన గోపాలశాస్త్రియు శివగౌరీ పరిణయాది కావ్యములను రచించెను, చెరుకూరి వేంకటరెడ్డిశాస్త్రి సర్వమంగళేశ్వరశాస్త్రి గారికి శిష్యుడును, అల్లుడునై యుండెను. ఇతడు గీతగోవిందమువలె గీత గిరీశ మను కావ్యమును వ్రాసెను. ముదుంబై నరసింహాచార్యుడు వాసవీ పరాశరీయ మను నాటకమును, భరత సర్వార్థసంగ్రహమను నాట్యగ్రంథమును, రామ చంద్ర కథామృతమను నొక బృహద్గ్రంథమును, విక్టోరియా ప్రశస్తి యనెడి కావ్యమును ఇంకను ననేక గ్రంథములను వ్రాసెను. ఈయన విజయనగర ప్రభువులలో నగ్రగణ్యుడగు ఆనందగజపతి ప్రాపున నుండెను.

ఆనందగజపతి స్వయముగ పండితుడై ఎక్కువ కాలము విద్వద్గోష్ఠు లలో గడపుచుండెడివాడు. విజయరామ గజపతి కొలువున నులడి ఆనంద గజపతికి గురువైన భాగవతుల హరిశాస్త్రి గొప్ప వ్యాకరణపండితుడు. ఇతడు వాక్యార్థదీపికయను పరిభాషేందు శేఖర వ్యాఖ్యను, చిత్రప్రభయను శబ్దరత్న

మున కొక ఉపవ్యాఖ్యానమును, నాగేశుని లఘు శబ్దేందు శేఖరమునకు రత్నాపణ వ్యాఖ్యను వ్రాసెను. ఆదిభట్ల నారాయణదాసు గొప్ప హరికథకులే కాక తెలుగునను సంస్కృతముననను పండితుడును కవియునైయుండెను. ఇతడు ఉమర్ ఖయ్యాంను సంస్కృతములోనికి అనువదించెను. శ్రీకృష్ణ కథామృతమను హరికథనుకూడ సంస్కృతమున వ్రాసెను. తారకమను సీతని కావ్యము ఐదు సర్గలలో నున్నది. ఇందు సంస్కృత ఛందో వ్యాకరణాంశములు సోదాహరణముగ నిరూపింపబడినవి. దూర్వాసుల సూర్యనారాయణశాస్త్రియను సంగీత విద్వాంసుడు కొన్ని పాటలను సంస్కృతములో వ్రాసెను. గుమ్మలూరు సంగమేశ్వరశాస్త్రి సుప్రసిద్ధ న్యాయశాస్త్ర పండితుడు. ఈయన మాధురీ, జాగదీశ క్రోడ పత్రములను వ్రాసెను. పేరి కాశీనాథశాస్త్రి, ఉత్తరశాకుంతలము, పాంచాలికా లక్షణము, యామినీ పూర్ణతిలక మను కావ్యముల వ్రాసెను. జయంతి వెంకన్న పంతులు అభినవరామాయణమును, ప్రహ్లాద చంపువును, శంకరుని శివానందలహరి ననుకరించుచు ముకుందానంద లహరిని వ్రాసెను.

విజయనగరమున నెలకొనిన సంస్కృత కళాశాలయు నెందరో కవి పండితుల కాలవాలమైనది తాతా సుబ్బరాయశాస్త్రి మహామహోపాధ్యాయులై గురుప్రసాదవ్యాఖ్యను నాగేశుని శబ్దేందు శేఖరముపై వ్రాసిరి. పేరి వేంకటేశ్వర శాస్త్రి గురుప్రసాద శేషమునేకాక నాగేశగూఢార్థ దీపికను కూడ వ్రాసిరి. ఈ గ్రంథములన్నియు పండితమాన్యము లైనవి.

విశాఖపట్టణ నివాసియైన పరవస్తు వేంకటరంగాచార్యులు మహామహోపాధ్యాయ బిరుదాంకితులైన సుప్రసిద్ధ సంస్కృత పండితులు. ఇతని తండ్రి శ్రీనివాసాచార్యుడు సర్వశబ్ద సంబోధిని యనెడి సంస్కృతాంధ్ర నిఘంటువును వ్రాసెను. వేంకటరంగాచార్యులు లఘు వ్యాకరణమును, కుంభకర్ణ విజయము, ఆంగ్లాధిరాజ్య స్వాగతమను కావ్యములను, మంజుల నైషధనాటకమును వ్రాసెను. మంజుల నైషధమున సంస్కృత విద్యయొక్క దైన్యావస్థ వర్ణించినాడు. ఇతడు సంస్కృతమున నొక విజ్ఞాన సర్వస్వమును వ్రాసియున్నారు. ఈ శబ్దార్థ సర్వస్వమున సంస్కృత వాఙ్మయమునందలి విషయములన్నియు పరామర్శింపబడినవి. ఇది ఇంకను అముద్రితమే.

సంగమవలస సంస్థాన ప్రభువైన మృత్యుంజయ నిశ్శంకు నృపాలుడు పండిత పోషకుడగుటయేకాక మృత్యుంజయ క్షోణిపాలీయ మను ప్రతిపద టీకను కాళిదాస నాటకత్రయముపై వ్రాసియుండెను. బొబ్బిలి రాజులు కూడ మండపాక పార్వతీశ్వర శాస్త్రి మున్నగు కవులను పోషించిరి. పార్వతీశ్వర శాస్త్రి చిత్ర కవిత్వమున నిపుణుడై గుణశ్లోకాది చిత్ర రచన మున్నగు కావ్యముల వ్రాసెను.

పిఠాపురము నేలిన వెలమ ప్రభువులు సంస్కృత కవుల నెందరినో పోషించి కృతిభర్తలునైరి, కూచిమంచి తిమ్మకవి యనునతడు సుజనమనః కుముదచంద్రిక యను నొక సంస్కృత గద్య ప్రబంధమును వ్రాసెను. అవసరాల పద్మరాజు వ్రాసిన భాగవత చంపువునకు పద్మరాజుచంపువను నామాంతరము కూడ కలదు. దీనికి సుధీ చంద్రిక, కవి రంజనీ యను వ్యాఖ్యానములు కూడ కలవు. దేవులపల్లి సోదరులని ప్రసిద్ధిగాంచిన సుబ్బరాయశాస్త్రి, తమ్మన శాస్త్రియను వారలు శతావధానులై రావువంశ ముక్తావళి మున్నగు గ్రంథముల రచించి గంగాధర రామారావున కంకిత మొసంగిరి. చావలి రామసుధి తన సాహిత్య చింతామణిలో సూర్యరాయ ప్రభువును కీర్తించెను. అల్లంరాజు సుబ్రహ్మణ్యకవి చాటుధారా చమత్కారసారమును వ్రాసెను. వీరు పండిత పరీక్షలను కూడ జరుపుచుండెడివారు.

పెద్దాపుర ప్రభువు వత్సవాయి జగపతి ఆస్థానమున అనివిళ్ళ వేంకట శాస్త్రి యను పండితుడుండెను. ఇతడు బాల కాళిదాస బిరుదము కలిగి చిత్ర చమత్కారమంజరి యను కావ్యమును వ్రాసి రాజున కంకితము చేసెను. ఈతని సూర్య శతకము చిత్రకవిత్వ పూర్ణమైనది. చావలి రామశాస్త్రి కువలయామోదమను అలంకార ప్రబంధమును వ్రాసి సింహాద్రి జగపతి కంకితము చేసెను.

ముక్తేశ్వరము జమీందారుల యాశ్రయమున నుండిన కొల్లూరి సోమ శేఖరుడు అలంకార మకరందము, సాహిత్య కల్పద్రుమము అను అలంకార శాస్త్రగ్రంథముల వ్రాసెను. ఇందు సాహిత్య కల్పద్రుమము వారణాశి ధర్మ సూరి వ్రాసిన సాహిత్య రత్నాకరమునకు ప్రతి స్పర్థిగా రూపొందినది. ఇందు

లక్ష్య శ్లోకములన్నియు శ్రీకృష్ణ స్తుతిపరములైనవి. జయఘోషణ, త్యాగ ఘోషణ మున్నగు నవీన కావ్య ప్రక్రియలిందు సోదాహరణముగా నిరూపింప బడినవి. అలంకార మకరందమున అమ్మన ప్రభువును కీర్తించెను. ఇతని భాగవత చంపువునందు కోనసీమ సంపద్వైభవమును చక్కగా వర్ణించినాడు. ఇందు ప్రౌఢ ప్రయోగములు కలవు.

శొంఠి భద్రాద్రిరామ శాస్త్రి ఉర్లాం ప్రభుల యొద్ద నుండి శ్రీరామ విజయాది కావ్యముల వ్రాసెను. కాకర్లపూడి జమీందారును కీర్తించుచున్న అలంకారమంజరి యను గ్రంథమొకటి లభ్యమగుచున్నది. దీనికర్త ఎవరో తెలియదు.

నూజివీడు ప్రభువైన శోభనాద్రి అప్పారావు స్వయముగ సంస్కృతమున కవియై తన తండ్రిని కీర్తించుచు రాజ్యలక్ష్మీపరిణయమను నాటకమును వ్రాసెను. అనివిళ్ళ వేంకటశాస్త్రి, మేకా నరసింహ అప్పారావును పొగడుచు అప్పరాయ యశశ్చంద్రోదయమను అలంకార ప్రబంధమును వ్రాసెను. ఇతడు అలంకార సుధాసింధువు, రుక్మిణీ పరిణయ నాటకము మొదలగు గ్రంథములను కూడ వ్రాసెను. ఈయన కుమారుడైన నారాయణ పండితుడు సాహిత్య కల్పద్రుమమున జగన్నాథ అప్పారావును కీర్తించి ఆయనకే అంకితము చేసెను. చర్ల వంశమునకు చెందిన పండితులును ఈ నూజివీడు ప్రభువుల యొద్ద నుండిరి. చర్ల వెంకటశాస్త్రి ధర్మసూరి సాహిత్య రత్నాకరమునకు నౌకయను వ్యాఖ్యను వ్రాసెను. భాష్యకార శాస్త్రి నూజివీడు ప్రభు కీర్తి పరముగ మేకాధీశ కల్పతరువను అలంకార ప్రబంధమును వ్రాసెను. ఇతడు అతిక్లిష్టమగు అన్వయము కలిగిన మేకాధీశ రామాయణమును, కంకణ బంధ రామాయణమును వ్రాసి వానికి స్వయంగా వ్యాఖ్యానములను వ్రాసెను, వేంకటశాస్త్రి యను సమాన నామధేయముకల ఇద్దరు పండితులు వరుసగా లక్ష్మీసహస్రవ్యాఖ్యను సీతారామ చంపువును వ్రాసిరి. వెంకటరంగ అప్పారావు ఆస్థానమున నుండిన గోపాలకృష్ణ కవి. శోభనాద్రీశ వైభవమను పెద్ద చంపువును వ్రాసెను. గాంగేయేశ్వర సూరి సాత్రాజితీ పరిణయచంపువు వ్రాసెను. రొంపివర్ల పార్థసారథి వైయాకరణ పంచానన బిరుదాంకితుడై మదనానంద భాణము, స్వాపప్రత్యయము మున్నగు గ్రంథముల వ్రాసెను.

దశరూపక పద్ధతియను నాటక లక్షణమును వ్రాసిన కొరవి రామకవి కార్వేటినగర జమీందారులయొద్ద నుండెను. ఇతడు అనంతుని భారత చంపువునకు లాస్యమను వ్యాఖ్యానమును, కువలయానందము, విశ్వగుణాదర్శ చంపువులకుకూడ వ్యాఖ్యలను వ్రాసియుండెను. కచ్ఛపేశ్వర దీక్షితుడు తన రామచంద్ర యశోభూషణమున బొమ్మరాజును కీర్తించెను.

కాళహస్తి జమీందారులు శిష్టు కృష్ణమూర్తిశాస్త్రి మున్నగు పండితులను పోషించిరి ఇతని యశోల్లాసము మేఘసందేశమునకు పూరణము. మదనాభ్యుదయ భాణము, కంకణబంధ రామాయణములను కూడ ఇతడు వ్రాసెను. పై భాణము శబ్దాలంకారపూర్ణమై శ్రీకూర్మక్షేత్రమున వసంతోత్సవమును వర్ణించు చున్నది. కంకణబంధ రామాయణమునకు స్వయముగ వ్యాఖ్యానమునుకూడ వ్రాసెను. కొక్కొండ వేంకటరత్నం పంతులు గీత మహానటమును, స్తోత్రములను వ్రాయుటయే కాక అక్షర సాంఖ్య వేదాంతమును ప్రతిపాదించుచు మార్గదాయిని యను గ్రంథమును వ్రాసెను. వెంకటగిరిలో కుమారయాచనృపాలుని ఆశ్రయముననున్న పురుషోత్తమ పండితుడు చతుష్షష్టి విద్యాసంగ్రహమును వ్రాసెను.

గద్వాల సంస్థానము సంస్కృత విద్యాపోషణమునకు మిక్కిలి పేరుగాంచినది. ఈసంస్థానమును పాకనాటి రెడ్డిరాజులు ఏలియుండిరి. వీరు పండితసభలను విద్వత్పరీక్షలనుకూడ జరుపుచుండిరి. రాయలూరు కందాళార్యుడు వేంకటభూపతిని స్తుతించుచు అలంకార శిరోభూషణమునువ్రాసెను. తిరుమలాచార్యుడు కల్యాణపురంజయ నాటకమును. కణాదం పెద్దనసోమయాజి చంపూరామాయణ వ్యాఖ్యానమును, కామసముద్రం అప్పలాచార్యులు యథాశ్లోక రామాయణమును రచించిరి.

సురపుర సంస్థాన ప్రభువులు తిరుమంల బుక్కపట్టణవంశీయులైన కవి పండితులను పోషించియుండిరి. వీరందరును విశిష్టాద్వైత వేదాంతమున అసమాన పాండిత్యము కలిగియుండిరి. వేదాంత గ్రంథములనేకాక కావ్య నాటకములనుకూడ వ్రాసిరి. అణ్ణయకవి ఆచార్యవింశతి, అభినవ కర్ణామృతము, రసోదారభాణము, తత్త్వగుణాదర్శ చంపువులనువ్రాసెను. ఈ చంపువులో వేంకటాధ్వరి విశ్వగుణాదర్శ చంపువు ననుసరించుచు శాంభవ, శ్రీవైష్ణవుల సంవా

దము మనోహరముగ వర్ణించినాడు. ఇందు సహజముగ శ్రీవైష్ణవుడే తత్త్వవేత్తయు లోకజ్ఞుడునని వర్ణింప బడినది. వేంకటాచార్యుడు యతిరాజ దండకము, అలంకార కౌస్తుభము, శృంగారలక్షణము, శృంగార తరంగిణీనాటకము మున్నగు వానిని రచించెను. శృంగారతరంగిణీ నాటకమున పారిజాతహరణ కథ సానుప్రాసముగ వర్ణింపబడినది. ఇతని బాణాసుర విజయ చంపువులో చంపకమాల, మదలేఖ, హంసీ యను వృత్తములు నిబంధింపబడినవి. బుచ్చి వేంకటాచార్యుడు అభినవ శృంగార రసమంజరి, కల్యాణపురంజయనాటకము, శృంగార సర్వస్వమను గ్రంథముల వ్రాసెను. కామసముద్రం వెంకటకవి విన్న వయసుననే రసికజనమనోల్లాస భాణమును వ్రాసెను. ఇందు కొక్కోకోపాధ్యాయుడను నొక కామతంత్రాచార్యుడుకూడ వర్ణింపబడినాడు.

తెలంగాణములోని జటప్రోలు సంస్థాన ప్రభువులును సంస్కృతమును పోషించిరి. కృష్ణమాచార్యుడు శ్రీ-కృష్ణచంపువు మున్నగు కావ్యములువ్రాసెను. సురభి వెంకట జగన్నాధరావు కొలువుననున్న హొసదుర్గం కృష్ణమాచార్యులు లక్ష్మీశవిలాసచంవువును, మదనగోపాల మాహాత్మ్య కావ్యమును రచించెను. పై చంపువులో సంస్థానాధీశుల వంశము విస్తరముగ వర్ణింపబడినది.

గోలకొండ నవాబుల కాలమునకూడ సంస్కృత సాహిత్య మభివృద్ధి చెందినది. గుల్బర్గా నివాసియైన అక్బరుషా అను మహమ్మదీయ పండితుడు తెలుగునను సంస్కృతమునను శృంగారమంజరియను అలంకార ప్రబంధమును రచించెను. ఇందు నాయికానాయక లక్షణములు శృంగారనాయికా ప్రభేదములు చక్కగా నిరూపింపబడెను. రసమంజరి మున్నగు గ్రంథముల నీతడు సయుక్తికముగ విమర్శించి యున్నాడు.

కందవోలు ప్రభువైన ఆనందరాయిదేశాయి ఆస్థానములో అయ్యావారు శాస్త్రి యను కవి యుండెను. ఇతడు సభారంజనమను నొక ఏకాంకిక రూపకమును వ్రాసెను. ఇందాకవి తనయొక్కయు, తనయాశ్రయమైన ప్రభువు యొక్కయు అనుభవములు పొందుపరచినాడు.

ఈ విధముగ నీ చిన్నచిన్న సంస్థానముల ప్రభువులును వారి చెంత నుండిన కవి పండితులును సంస్కృత సాహిత్యమున కెనలేని సేవ యొనర్చిరి. సంస్కృత శాస్త్రాధ్యయనమునకు విద్యావ్యాప్తికి నెంతో తోడ్పడి యుండిరి.

# ఇతర కవి పండితులు

ఆయా రాజాస్థానములతో విశేషముగ సంబంధము లేకయే సంస్కృత భాషా సేవ చేసిన కవిపండితులెందరో ఉండిరి. వీరిలో మిక్కిలి ప్రసిద్ధి గాంచిన కొందరి నిట స్మరించుట మన కర్తవ్యము.

బొమ్మకంటి అయ్యలునాథ కవి కుహనాభైక్షవ ప్రహసనమును వ్రాసెను. ఇది రాజశేఖర పురమున గోపికారమణుని వసంతోత్సవమున వ్రాయబడెను. ఇందు ఆత్మయోనితీర్థుడను బౌద్ధభిక్షువు అహమ్మదుఖాన్ అను తురుష్కుని వద్దనున్న చంద్రలేఖయను వేశ్యను పొందుట హాస్యరస భరితముగ వర్ణింపబడినది. ఇంద్రకంటి నారాయణకవి శ్రీహర్షుని నైషధీయ చరితముపై సిద్ధాంజనమను వ్యాఖ్యానమును వ్రాసెను. ఇతని కుమారుడైన కొండుభట్టు శృంగార రస భృంగారమను భాణమును రచించెను. ఇదే వంశమున జన్మించిన లింగంభట్టు కాళిందీముకుంద చంపువును వ్రాసెను. ఇది కేవలమొక తెలుగు ప్రబంధమువలె నున్నది. ఈ చంపువులో కాళిందియు ఆమె చెలికత్తెయైన విశారదయు పరస్పరము ప్రాకృతమున సంభాషించు కొందురు. ప్రౌఢకవి యను నామాంతరము కలిగిన ఈయన శృంఖలాది బంధములను కూడ నిబంధించినాడు. కనకసభాపతి వృత్తారత్నాకరమునకు లలితయను చిన్న వ్యాఖ్యను వ్రాసెను. సీతారామకవి వృత్తదర్పణమును, కొన్ని క్షేత్ర మాహాత్మ్యములను వ్రాసెను.

కొడమర్తి కామేశ్వరుడు పద్మనాభ ప్రభువుయొక్క ఆజ్ఞప్రకారము శంకరుని సౌందర్యలహరికి అరుణామోదినీ వ్యాఖ్యను వ్రాసెను. ఇతని రామాయణ చంపూ వ్యాఖ్యానమునకు విద్యుల్లతయని పేరు, దేవరకొండ కృష్ణబుధుడు తన అలంకార సర్వస్వమున గోపాల దేవుడను నాయకుని కీర్తించెను. ఏలేశ్వర గోపాలకవి జైమినీభారతముననుసరించుచు యుధిష్ఠిరాశ్వమేధ చంపువును రచించెను. గోవింద జ్యోతిర్విదుడు గోదావరీ తీరమున నున్న శిపురి వాస్తవ్యుడు. జ్యోతిశ్శాస్త్ర పండితుల కుటుంబమునకు చెందినవాడు. అట్టాలదేశీయుడైన రామచంద్రుని సభ్యాభరణమను పద్య సంగ్రహమునకు వ్యాఖ్యానము సీతడు వ్రాసెను. తిమ్మయసూరి సుబంధుని వాసవదత్తపై దర్పణ వ్యాఖ్యను రచించెను.

తిరుమలాచార్యుడు ప్రతాపరుద్రీయము మీద రత్నశాణ వ్యాఖ్యనేకాక కువలయానందముపై చమత్కారచంద్రికా వ్యాఖ్యానమును వ్రాసెను. తిరువేంకట దేశిక స్వామి ప్రాకృతమున శ్రీశైలాధీశస్తుతిని దానికి సంస్కృత ఛాయను కూడా వ్రాసెను. సింహాచల నివాసియైన మరింగంటి నరసింహాచార్యుడు తన శఠవైరి వైభవ దివాకరమను అలంకార ప్రబంధమున నమ్మాళ్వారును కీర్తించుచు ఉదాహరణ శ్లోకములను రచించెను. కందుకూరి నాగనాథకవి మీనాక్షీ విజయచంపువును వ్రాసెను. అందు మధురాపుర వర్ణనము, మీనాక్షీ దేవి వివాహము వర్ణింపబడినది. పద్మనాభకవి తన త్రిపుర విజయ వ్యాయోగమున కోటిపల్లి సోమేశ్వరుని వసంతోత్సవమును వర్ణించెను. మరియొక పద్మనాభుడు లీలాదర్పణ భాణమున లీలావతియను కలావతికిని లీలాశేఖరునకును మధ్యగల ప్రణయమును వర్ణించినాడు.

పశుపర్తి పాప యల్లయసూరి గొప్ప వ్యాఖ్యాత. ఇతడు లీలాశుకుని కృష్ణ కర్ణామృతమునకు సువర్ణచషక యను వ్యాఖ్యను వ్రాసెను. వ్యాఖ్యారంభమున పెద్దిభట్టును ప్రశంసించినాడు 'సోమగిరి' 'చింతామణి' అను పదముల కితడు వ్యాఖ్యానాంతర మొనర్చి లీలాశుకుడు ఆంధ్రుడేమోయను శంకనుకూడ చూపినాడు. 'యద్వా చింతామణి రితి శ్రీకాకుళేశ్వరానుగ్రహ వశాన్నిర్మలాంతరంగా కాచిద్వనితేతి వా".

ఏలేశ్వర మహోపాధ్యాయవంశమువాడైన పెద్దిభట్టు సూక్తివారిధి యను సుభాషితసంగ్రహమును కూర్చెను. ఇందు పదమూడు శతకములున్నవి. రాజశతకమున కృష్ణరాయలు, వేమ భూపాలుడు. వీరరుద్రుడు, శ్రీరంగక్షితీశుడు పేర్కొనబడినారు. భాస్కరకవి శివమోహినీ విలాస మహాకావ్యమున కొన్ని అష్టపదులనుకూడ వ్రాసినాడు.

బొల్లాపిన్ని మల్లినాథుడు అమరకోశముపై అమరపద పారిజాతమను టీకను వ్రాసెను. ఇందీతడు సుభూతి వ్రాసియుండిన టీకను పరామర్శించినాడు. వంగల లింగయసూరి అమరకోశముపై అమరకోశ పదవివృతి యను వ్యాఖ్యానమును రచించెను. ఇది లింగాభట్టీయమని ప్రసిద్ధి చెందినది. దీనికి తమిళమున అనువాదము కూడ కలదు ఇది మల్లినాథునకు పూర్వమే వ్రాయబడినదని కొందరందురు

చిలకమర్తి వెంకటాచార్యుని మనుమడైన రంగశాయి భానుదత్తుని రస మంజరిపై ఆమోదవ్యాఖ్యను వ్రాసెను. అక్బరు షాహీ శృంగార మంజరి దీనిని అనుసరించుచున్నది. వేంకట కృష్ణకవి విలాస భూషణ భాణమున భద్రాచల క్షేత్రమందలి సీతారాముల కల్యాణ మహోత్సవమును వర్ణించియున్నాడు. ఇందొక మాలికా బంధముకూడ వ్రాయబడినది. గొడవర్తి వేంకట నారాయణ దీక్షితుడు శృంగారసార మను అలంకార ప్రబంధమున ధర్మార్థకామ మోక్ష శృంగార భేదముల వర్ణించినాడు. అదే నామముకల మరియొక గ్రంథములో రూపక ప్రభేదములు క్షుద్రప్రబంధములు వర్ణింపబడినవి.

విదగ్ధ చూడామణి పంచాశన్నిఘంటు సారమును, యల్లాపంతుల వేంకటేశ్వరుడు దక్షిణామూర్తి నిఘంటువును వ్రాసిరి. రెండవ దానియందు ముఖ్యముగ ఓషధులు చెప్పబడినవి. వేంకటాచార్యకవి కోకిల సందేశమును వ్రాసెను. శ్రీశైల వేంకట రాఘవకవి శృంగార కందుకమను ప్రబంధమునకు సుమచాప విహారమను వ్యాఖ్యానము వ్రాసెను. శృంగార కందుకము నెవరు వ్రాసిరో తెలియదు, ఇందు పూర్వాపంచాశత్, ఉత్తమ పంచాశత్ అని రెండు విభాగములున్నవి. గ్రంథమునకంతకును జార పంచాశత్ అను నామాంతరము కూడ కలదు. ఇందు జగన్నాథస్వామి రథోత్సవమును వర్ణించుచు జగన్నాథ స్వామినే జారుడుగా చిత్రించిన శృంగార శ్లోకములున్నవి. దీనికి మన్మథోల్లాన మను మరియొక వ్యాఖ్యయు కలదు. వేంకటాచార్య కృతమైన చాతురీ చంద్రికా భాణమున తిరుపతిలోని ఉత్సవములు చతురశేఖరుడు,చమత్కారమంజరి అను వారల శృంగారమును వర్ణింపబడినవి.

భక్తిభూపతి కుమారుడైన మనమ భూపుని ఆశ్రితుడై యుండిన అమృతానంద యోగి అలంకారసంగ్రహమను ప్రకరణమును వ్రాసెను. ఈ రాజు లెవరో గుర్తింపలేకున్నాము. ఇందు అక్షరముల యొక్కయు గణముల యొక్కయు మంగళామంగళ ఫలితములు, ఉదాహరణ కావ్య భేదములు వర్ణింపబడినవి. చింతగుంట నాగభూపాలుని పొగడుచు పురుషోత్తమసుధి కవితావతారమను అలంకార గ్రంథమును వ్రాసెను. ఇందును చాటు ప్రబంధములు నిరూపింపబడినవి.

తాళ్ళపాక అన్నమాచార్యుడు సంస్కృతమునకూడ పాటలను వ్రాయుటయేకాక పదలక్షణమను సంగీత శాస్త్రగ్రంథమునుకూడ రచించెను. ఇతని

మనుమడు చిన తిరుమలయ్య సంకీర్తన లక్షణము వ్రాసెను. పెద్దిభట్టు వ్రాసిన ప్రసంగ రత్నావళి యందు డెబ్బదిరెండు పద్ధతులలో వివిధ గ్రంథములనుండి ప్రాస్తావిక శ్లోకములు సుభాషితములు సంగ్రహింపబడినని. ఇందు సమకాల ప్రభువులు, కవులు పేర్కొనబడియున్నారు. దీనికి సంక్షిప్తరూపమైన ప్రసంగ రత్నావళీ సంగ్రహముకూడ లభ్యమగుచున్నది.

అభినవ కాళిదాస బిరుదాంకితుడైన వెల్లాల ఉమామహేశ్వరుడు మోక్ష గుండం అక్కయసూరి శిష్యుడు. ఇతడు అద్వైత వేదాంతవేత్తయై అద్వైత కామధేను, విరోధవరూధిని మున్నగు వేదాంత గ్రంథములను వ్రాసెను. వ్యాక రణశాస్త్ర పండితుడై పాణినీయవాద నక్షత్రమాలను వ్రాసెను. కవికుంజరు డీతడు విజయనగరరాజుల కొలువులో దుర్జయుడను పండితుని నిర్జించెనని వర్ణించినాడు. ఇతని భాగవత చంపువునకు ఈతని గురువైన అక్కయ్య సూరియే రత్నావళి యను వ్యాఖ్యను వ్రాసియుండెను, కవికుంజరుడు ఉమా మహేశ్వరుని శిష్యుడే. ఈతడు సభారంజన ప్రబంధమును వ్రాసెను.

వారణాశి ధర్మసుధి తన సాహిత్య రత్నాకరమున ఉదాహరణ శ్లోక ముల నన్నింటిని శ్రీరామస్తుతి పరముగ వ్రాసెను. రాజాశ్రయము పొంది వారినే పొగడిన విద్యానాథాదులను నిరసించినాడు. ఇతడు నరకాసుర వ్యాయో గమును, సూర్యశతకమును, హంసదేశమను ప్రాకృతకావ్యమునుకూడ వ్రాసెను. పై సాహిత్యరత్నాకరమునకు మల్లాది లక్ష్మణసూరి, వెంకటేశుడు అను తెలుగు వారలేకాక మధుసూదనమిశ్రుడను నొక యుత్కళదేశీయుడును వ్యాఖ్యాన మును వ్రాసెను. ఈయన సన్యసించి రామానంద నామధేయుడై కాశీలో శంక రుని బ్రహ్మసూత్ర భాష్యమునకు రత్నప్రభావ్యాఖ్యను వ్రాసినట్లు ముందే చెప్పి యున్నాము.

రావూరి కాళహస్తికవి అప్పయ్య దీక్షితుని శిష్యుడు. ఇతడు రామరాజ భూషణుని వసుచరిత్రను సంస్కృతమున వసుచరిత్ర చంపువను పేర వ్రాసెను. ఈయన భేదధిక్కారవివృతి యను వ్యాఖ్యనుకూడ రచించెను. వేంకటాచార్యుడు తన రుక్మిణీపరిణయ చంపువులో బమ్మెర పోతనామాత్యుని తెలుగు భాగవత ము ననుసరించుచు రుక్మిణీకల్యాణ కథను వర్ణించెను. విరూపాక్షయజ్వ చంద్రా లోకమునకు శారదాశర్వరీ వ్యాఖ్యను, సంస్కృత వృత్తములను సోదాహరణ ముగ నిరూపించుచు నృసింహ వృత్తమాలను వ్రాసెను.

తణుకు నివాసియైన శాంతలూరి కృష్ణసూరి సాహిత్య కల్పలతికను వ్రాసెను. ఇందు సంస్కృత కావ్యములలోని వ్యాకరణ విశేషములను చర్చించి యున్నాడు. ఈ గ్రంథముయొక్క ఐదవ అధ్యాయమునకు అమర మండన మని పేరు. దీనిలో శ్రీ హర్ష పండితుడు వ్రాసిన అమరఖండనము నిశితముగ విమర్శింపబడినది. ఇతడు తన అలంకారమీమాంసలో జగన్నాథుడు రసగంగాధరమున చేసిన పూర్వాలంకారికుల మతఖండనమును విమర్శించి వారి సిద్ధాంతములను పునఃప్రతిష్ఠాపించినాడు. అమరమండనమున ఆ కాలములో తెలుగు దేశములోనను, పరిసరప్రాంతములందును రచింపబడిన కోశగ్రంథములు, నిఘంటు వ్యాఖ్యానములు ఎన్నియో పరామర్శింపబడినవి.

వెల్లాల రామచంద్రకవి సరసకవికలానందభాణమును, శ్రీ కృష్ణవిజయ వ్యాయోగమును వ్రాసెను. చాగంటి మల్లనారాధ్యుడు శివలింగ సూర్యోదయమును రచించెను. కల్య లక్ష్మీనృసింహకవి విశ్వదేశికవిజయమును కవికౌముది యను అన్యోక్తుల సంకలనమును వ్రాసెను. వట్టివల్లి నరకంఠీరవుడు సుబంధుని వాసవదత్తను సంగ్రహించుచు ఆర్యావృత్తములలో వాసవదత్తా కథాసారమును వ్రాసెను. ఓరుగంటి లక్ష్మణ సోమయాజి సీతారామ విహార మహాకావ్యమును వ్రాసెను. దీనిపై రెండు వ్యాఖ్యలును వచ్చినవి. ఇందు కాశీపుర మాహాత్మ్యము సవిస్తరముగా వర్ణింపబడినది. ఇతడు కైయట వివరణము, సంగీతలక్షణము, గీతమాహేశ్వరమను గ్రంథములనుకూడ రచించెను. సోమేశ్వర పండితుడు రాఘవయాదవీయమను ద్వ్యర్థికావ్యమును వ్రాసెను. ఓరుగంటి రామామాత్యుడు శివోదాహరణమును, కాశీపట్నం సిద్ధరామకవి మల్లికార్జున స్తవోదాహరణముఅను ఉదాహరణ కావ్యములను రచించియుండిరి. మామిడి వేంకటార్యుని శబ్దార్థకల్పతరుకోశమున అకారాంతాది అంత్య వర్ణక్రమమున సంస్కృత పదములు చెప్పబడినవి. ఘట్టివల్లి కుమారస్వామిశాస్త్రి చెన్నబసవపురాణమును సంస్కృతీకరించెను. అనంతరామ పండితుడు సుప్రసిద్ధ వేదాంతగ్రంథమైన సీతారామాంజనేయమును వ్రాసిన లింగమూర్తి వంశములోనివాడే. ఇతని సీతావిజయ చంపువులో శతకంఠరామాయణ కథ వర్ణితమైనది.

కోరాడ రామచంద్రకవి ప్రసిద్ధులైన అర్వాచీన సంస్కృత కవులలో ఒకరు. ఇతడు మచిలీపట్టణమున కళాశాలలో పనిచేయుచు అనేక సంస్కృత గ్రంథములను వ్రాసెను. ఇతని ఘనవృత్తము మేఘ సందేశమునకు ముగింపు.

ఇతని గ్రంథములలో కాళిదాసుని కవికంఠపాశమునకును, అమృతానందయోగి యొక్క అలంకార సంగ్రహమునకును వ్రాసిన వ్యాఖ్యలు పేర్కొనదగినవి. ఇతని రామచంద్రీయ మొక గద్యకావ్యము. ఇతడు స్వోదయ కావ్య మనుపేర తన స్వీయ చరితమునుకూడ సంస్కృతమున రచించెను. మేడేపల్లి వెంకట రమణాచార్యులు షేక్స్పియరు నాటకకథలను, వకుళాభరణమును సంస్కృత మున వ్రాసెను.

బెల్లంకొండ రామరాయకవి అసమానప్రతిభాశాలియై అనేక గ్రంథము లను వ్రాసెను. వానిలో స్తోత్రములు, సంగీతకావ్య లక్షణములు, కావ్యములు, వేదాంతాది శాస్త్రగ్రంథములుకూడ ఉన్నవి. సిద్ధాంత కౌముదికి శరద్రాత్రి యను వ్యాఖ్య, శాంకరభాష్య విమర్శ, చంపూభాగవత వ్యాఖ్య, కృష్ణలీలా తరంగిణి యను గీతకావ్యము, గీతాభాష్యము మున్నగునవి ఈతని ప్రముఖ కృతులు.

కావ్యకంఠ గణపతి శాస్త్రియు విశేష ప్రతిభాన్వితుడైన పండితుడే. ఇతడు రమణమహర్షి యాశ్రమమున నుండి రమణగీత, ఉమా సహస్రము, భృంగ దూతము, సుకన్యా దర్శసంవాదము మున్నగు గ్రంథములను వ్రాసి యుండెను. ఈయన అశుకవితా నైపుణ్యము కలిగియుండెను. వేదమంత్రము లకును వ్యాఖ్యలు వ్రాసెను.

ప్రస్తుత కాలములోకూడ సంస్కృతమున కావ్య నాటకములు వ్యాఖ్యా నములు, శాస్త్రటీకలు వ్రాయువారు లేకపోలేదు. వీరిలో కొందరు నూతన ప్రక్రియల నవలంబించి సమకాలీన విషయములను గూర్చియు వ్రాయుచున్నారు. తెలుగు సాహిత్యములోని సుప్రసిద్ధ కావ్యముల ననువదించుట, వాని నాధారము చేసికొని సంస్కృతమున గ్రంథనిర్మాణము చేయుట కూడ జరుగుచున్నది. అందు శ్రీ యస్. టి. జి. వరదాచార్యులవారి శతకానువాదములు, శ్రీ కె, వి. యన్. అప్పారావుగారి గాంధీగీత, శ్రీకొల్లూరి సోమశేఖరశాస్త్రిగారి మాధ్యమిక కారికావ్యాఖ్య, శ్రీ పేరి సూర్యనారాయణశాస్త్రిగారు భూషణసారముపై వ్రాసిన తత్త్వదర్శినీ వ్యాఖ్య, శ్రీ సన్నిధానం సూర్యనారాయణశాస్త్రిగారి రామదాసము, వివేకానందము పేర్కొనదగియున్నవి.

ఆధునిక పరిశోధనా పద్ధతిలో సంస్కృత పాండిత్యమును పొంది భాషాసేవ చేసినవారును కలరు. అట్టివారిలో మానవల్లి రామకృష్ణకవి పేర్కొనదగియున్నాడు. తిరుపతిలో సంస్కృత పరిశోధనకై శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య విద్యా పరిశోధన సంస్థానము చాలాకాలమునుండి పని చేయుచున్నది. వీరొక సంస్కృత పరిశోధన పత్రికను కూడ నడపుచున్నారు. ఉస్మానియా విశ్వవిద్యాలయమున కనుబంధముగనున్న సంస్కృత ఆకాడమీవారు ఉత్తమ సంస్కృత గ్రంథములను పరిష్కరించి ముద్రించుచున్నారు. చిత్తూరులోని సంస్కృత ప్రచారిణీ సభవారు సంస్కృతమున పరీక్షలు జరువుటయేకాక గైర్వాణియను సంస్కృత పత్రికనుకూడ నడవుచున్నారు. తిరుపతినుండి చాలకాలము ముఖ్యముగ శ్రీ డి. టి. తాతాచార్యులవారి పర్యవేక్షణలో ఉద్యాన పత్రిక వెలువడినది. కొందరు సంస్కృత పండితులు సంస్కృత గ్రంథములకు చక్కని తెలుగు అనువాదములను వ్రాసి తెలుగువారు సులభముగా ఆయా సంస్కృత గ్రంథముల నభ్యసించుటకు తోడ్పడుచున్నారు. ఇట్టివారిలో అప్పల్ల జోగన్నశాస్త్రిగారి కావ్యవ్యాఖ్యలు చెప్పదగినవి. తెలుగు అకాడమీ వారి యాధ్వర్యమున వాక్యపదీయము, మహాభాష్యము మున్నగు శాస్త్ర గ్రంథములకు తెలుగు వ్యాఖ్యలుకూడ వెలువడుచున్నవి. రాష్ట్రసాహిత్య అకాడమీ వారును సంస్కృత గ్రంథ ప్రచురణమునకు తోడ్పడుచున్నారు.

పైన వివరించిన రీతిని తెలుగువారు అమరవాణిని బహుముఖముగ సేవించి కృతార్థులైరి. సంస్కృత వాఙ్మయ ప్రక్రియలన్నియు తెలుగు దేశమున వెలసినవి. వేద వేదాంగముల వ్యాఖ్యలు, రామాయణ మహాభారత వ్యాఖ్యలు, కథలు, పురాణేతిహాస సంగ్రహములు, వివిధ దృశ్య శ్రవ్య కావ్యములు, కావ్యవ్యాఖ్యానములు ఉదాహరణాది నూతన కావ్య విశేషములు వచ్చినవి. బౌద్ధము, వేదాంతము, న్యాయ వ్యాకరణ మీమాంసాది శాస్త్రములలోను స్వతంత్ర గ్రంథములు వ్యాఖ్యలు రచింపబడినవి. అలంకార శాస్త్రమునను సంగీత నాట్యములందును మంచి గ్రంథములు చాలా వచ్చినవి. ఇక గణితము, ఆయుర్వేదము, జ్యోతిషము మున్నగు శాస్త్రములందును గ్రంథరచన సాగినది. నిఘంటు రచన, పరిశీలనము బాగుగా జరిగినవి. ఆధునిక కాలములో కూడ సంస్కృత రచన కొనసాగినది. ప్రాకృతము, తెలుగు వ్యాకరణములును సంస్కృతమున వ్రాయబడినవి. తెలుగువారి సంస్కృత శాసనములును విశేష కావ్య లక్షణములతో విరాజిల్లుచున్నవి.

సంస్కృత కావ్యాధ్యయనము జరిగినంత కాలము మల్లినాథుని ఎవరును విస్మరింపజాలరు. ఇటులనే తర్క శాస్త్రాభ్యాసమునకు తర్క సంగ్రహము మొదటిమెట్టు, అలంకార శాస్త్రవాఙ్మయ వికాసములో కాశ్మీరము తరువాత చెప్పదగినది తెలుగు దేశమే. విద్యానాథుని ప్రతాపరుద్రీయమున్నూ, విషయ పరిష్కారమునకు జగన్నాథుని రసగంగా ధరమున్నూ విశేషముగ చెప్పుకొనదగినవి. చమత్కార ప్రస్థానమును విశేషముగ నిరూపించిన చమత్కార చంద్రికయు విశిష్ట గ్రంథమే. తెలుగు దేశమున వెలసిన కావ్యములలో చంపువులు, చరిత్ర కావ్యములు ముఖ్యమైనవి. ప్రశస్తికావ్యము లొక నూతన ప్రక్రియ. ఇవి ఇచట వచ్చిన లక్షణగ్రంథములలోనను నిరూపింపబడినవి. ఇచటి శాసనములలో కావ్యములే శిలాంకితములై విరాజిల్లు చున్నవి. పరవస్తు వేంకటరంగాచర్యులవారు వ్రాసిన శబ్దార్థసర్వస్వ మొక సంస్కృత విద్యా సర్వస్వమే. మరియు తెలుగునాట వెలసిన ఈ సంస్కృత సాహిత్యము నందంతటను తెనుగుదనము స్పష్టముగా భాసించుచున్నది.

ఈ విధముగా సంస్కృత భాష, సాహిత్యము ఆంధ్రదేశమున మిక్కిలి ఆదరమును పొంది చిరకాలము గొప్ప వికాసము పొందియున్నది. రాజులు మంత్రులు, సామంతులు, సంస్థానాధీశులు సంస్కృత కవులను పండితులను పోషించిరి. వేదశాస్త్రములు, కావ్యములు, లక్షణ గ్రంథములు నిత్యనూతన ప్రక్రియలతో వెలసినవి. నేడీ గ్రంథములు లిఖితరూపమున ఆంధ్రప్రదేశ మందలి పుస్తకభాండారముల యందేకాక తంజావూరు, మద్రాసు, మైసూరు, తిరువనంతపురము, లండనుసగరములలో సంగ్రహింపబడియున్నవి. ఇతర ప్రాంతములనున్న తెలుగువారి గ్రంథముల ప్రతికృతులను వ్రాయించి యుంచుకొనుట మన ముఖ్య కర్తవ్యము. వీనిలో పెక్కులు అముద్రితములును, అసమగ్ర ముద్రితములునై యున్నవి. ఈ సంపదను సంరక్షించుకొనుట కొక ప్రత్యేక గ్రంథమాలను సక్రమముగ పరిష్కరించి ముద్రింపవలసియున్నది. వేద శాస్త్రములను ఇతిహాస పురాణములను శాస్త్రీయపద్ధతి నభ్యసించి పరిశోధన చేయుట, ప్రాకృతమును కూడ అధ్యయనము చేయుట, సంస్కృత భాష. వాఙ్మయమును గూర్చి విశేష పరిశోధనమును చేయుట మిక్కిలి అవసరము. సంస్కృత వాఙ్మయములోని విషయములను తెలుగున ప్రచారము చేయుటయు మన కర్తవ్యమే. మన ప్రభుత్వమువారు సంస్కృత పరిశోధనకై ఒక కేంద్రమును స్థాపింపవలెనని ఆలోచించు

చుండుట ప్రశంసింపదగియున్నది. ఆ పరిశోధన కేంద్రము సంస్కృతభాష, వాఙ్మయముల విషయమున శాస్త్రీయ పద్ధతిని, ప్రాచ్య పాశ్చాత్య పద్ధతులను మేళవించి పరిశోధన జరుగగలదనియు, తెలుగువారు వ్రాసిన సంస్కృత గ్రంథములన్నియు ప్రచురింపబడగలవనియు, ప్రాకృత పరిశోధనము. వేద శాస్త్ర పరిశోధన మనదేశమునకూడ ఉన్నత స్థాయిలో జరుగుగలవనియు ఆశింపవచ్చును. అదే విధముగా శాస్త్రీయమైన పరిశోధనను ప్రోత్సహించి పరిశోధన పత్రికనుకూడ ప్రచురించుట ఆవశ్యకమై యున్నది.

ఆసీదాంధ్రమహీయం, సంస్కృత వాణ్యాశ్చిరం విహృతిరఙ్గమ్
ఉపలాలితాచ సాభూధ్భూపైః విద్వద్భిరత్రత్యైః ॥

"ఈ తెలుగుదేశము చిరకాలము సంస్కృతభాషకు విహారభూమి యైనది. ఇచటి రాజులును, విద్వాంసులును, సంస్కృత సారస్వతమును మిక్కిలి ఆదరముతో సేవించియున్నారు".

ప్రత్యానీతా సాత్ర స్థాస్యతి సుచిరం యథా, తథా యూయమ్.
ఆంధ్రజనా బహుమానం, తస్యాం సర్వే ప్రదర్శయత॥

"ఆ సంస్కృతభాష పునరుద్ధరింపబడి యథాపూర్వము ఈ దేశమున స్థిరపడునటుల ఓ ఆంధ్రజనులారా! దాని యందాదరమును చూపుడు".

# దేశభాషలందు తెలుగు లెస్స




ప్రపంచ తెలుగు మహాసభలు

1975, ఏప్రిల్ 12 - 18